శ్రీని—ఓష్. ఇంతేనా ఇంతా చేస్తే ఇక్కడ వేదాంతం నేర్పడానికి వచ్చారా బాబు

రమ—I am sorry. మీకు philosophy అంటే ఏమిటో conception లేకుండా మాట్లాడుతున్నారు. It is consummation of all sciences అన్నమాట.

శ్రీని—క్షమించండి. ఆమాత్రం తెలుసు కాని అది ఇక్కడెందుకని మామనవి.

రమ—అవునులెండి. అయినా M. A. ఊరికే పోతుందాండి. వెధవది Intermediate history చాలాదండీ పిల్లకి చెప్పడానికి B A. కావాలా యేమిటి?

శ్రీని—Department వాళ్లు ఒప్పుకోరు లెండి అయినా మనకిప్పుడీ కంఠశోష యెందుకు? అది సెక్రటరీ గారివరికో ఇచ్చేసారట:

రమ—సరేపనికట్టుకుని వచ్చానుగదా. అదేదో ఆయనదగ్గర నుంచే వింటాను. రామచంద్రపురములో ఇంకో chance ఉంది లెండి. దానికిప్పుడప్పుడే తొందరలేదు.

వెం—అక్కడేమున్నదండీ?

రమ—అది History graduate కేలెండి. L. T. లు అక్కర్లేదక్కడ.

వెం—అక్కర్లేకేమిటి? అయితే మీకూ అక్కర్లేదిక్కడ. P. A. ఖర్చుకివస్తే చేదాయేమిటి L. T. వాడు.

రమ—ఎవరు వస్తారండీ అట్లాగ?

వెం—ఓహో! ఇచ్చేవాడుంటే నేనువస్తాను. మాటకి చెప్పినాను సుమండీ నేనంటే నేనేకాదు ఏవరైనా వస్తారు. ఎప్పుడు చూశారుమీరు advertisement?

రమ—నిక్సైతే christian preferable అని ఉంటిలెండి.

వెం—మరిమీకేమి chances ఉన్నాయి?

రమ—నేను christian కాలేజీ student ని. నాకుకొన్ని recommendations కూడా ఉన్నాయి.

వెం—ఎవరండీ అక్కడ ఉద్యోగం ఇవ్వడం?

శ్రీని—Manager Mission దొరగారు. ఏమీలాభంలేదు లెండి అక్కడ try చేయడం. ఇక్కడే ఉండి ఇదేదో చూసుకోండి.

వెం—మేము అక్కడికివచ్చి మీకువచ్చేది చెడగొట్టంలెండి. అందరం open గానే compete చేద్దాం సెక్రెటరీ ఇప్పుడు ఊళ్లో లేదు. వచ్చిందాకా ఉంటారా? వెళ్లిమళ్లావస్తారా?

రమ—మళ్లిరాలేనులెండి. వచ్చిందాకా ఉంటాను. ఏదో కొంచెము fair hopes ఇచ్చారుమరి.

శ్రీని—ఏమి hopes ఇచ్చాడు?

రమ—వచ్చిమాట్లాడండి అని వ్రాసాడు. అక్కర్లేకపోతే ఎందుకు వ్రాస్తాడు?

శ్రీని—నీఇల్లు బంగారంగాను. అందరికీ వ్రాసినాడట్లా. ఉండండి యీయుష్టం. మీకు కావడం కష్టమని తోస్తుంది.

రమ—strong recommendations కూడా తిస్కువచ్చానండీ?

శ్రీని—ఈయన recommendations కి care చేసేవాడు కాదు లెండి మీకే తెలుస్తుంది. మేము ఏమిచెప్పినా మాకోసం చెప్పినామనుకుంటారు. భోజనం ఎక్కడ ఏర్పాటుచేశారు?

రమ—ఈపూట భోజనము చేయనులెండి. మీకుపొద్దుపోయింది భోజనానికి వెళ్లరూ?

శ్రీని—మీరుపడుస్తూఉండండి. మేమునింపాదిగా వస్తాము.

రమ—అందరమూ ఒకచోటే ఉందాము.

శ్రీని—వంటపూటిఘుండ మంచిదికాదు. ప్రతివాణ్ణీ ఏదో ఒకటి అంటూఉంటుంది మీరిక్కడుందురూ మేము తిండితిని యిట్టేవస్తాము.

రమ—అయితేరండి. వచ్చేటప్పుడు Scissors ఒకటి తీసుకురండి.

శ్రీని—అర్ధరాత్రి Scissors ఏందుకయ్యా! ఏంక త్తిరిస్తావు?

రమ—సిగరెట్లయ్యా. ఈకాలపువాడివి కానట్టున్నావేం.

శ్రీని—బాబూ! మీకుదండం. వేరేఉండండి. మాకుఉద్యోగం అవనిచ్చేటట్టు లేదు మీరు.

రమ—ఏమి? ఈఊళ్లో సిగరెట్లుకాల్చకూడదూ? స్కూల్లో కాలుస్తా మూ యేమన్నా నా.

శ్రీని—ఈఊళ్లో ఎక్కడకాల్చినా తప్పే. సంగతిచెప్పినాను. డబ్బు లివ్వండి తెస్తాను. రహస్యంగా పీలుద్దాం.

రమ—రూపాయి ఉందంసి మార్చాలి.

శ్రీని—ఇల్లాపారేయవయ్యా. మార్చుతాను. రూపాయకే నమ్మ లేరా యేమిటి.

(రమణరావు రూపాయిచ్చును).

శ్రీని—(తక్కినయిద్దరితో) ఒరే వీడిదగ్గర డబ్బుబాగా ఉన్నట్టుంది ర్లోయ్. పెట్టుబడికి పనికివస్తాడు. మంచిమాట్లాడుదాం.

(శ్రీని, వెంక, జోగ, నిష్క్రమింతురు)

(రమణరావు కూర్చొనియుండును).

(తెరలో) ఎవరాచీకట్లో కూర్చున్నవాడు?

రమ—ఎవరుకావాలి మీకు?

(తెరలో) ఎవరో తెలుసుకుందామని అడిగినాను తప్పటయ్యా

కొత్త L. T. లెవరైనా వచ్చారేమో అనుకున్నాను. ఏ ఊరు?

రమ—ఇది సేలటూరు.

(తెరలోనుంచి విశ్వనాథశాస్త్రి ఇవతలకువచ్చి)

విశ్వ—దీనిమాట నేనడగలేదు. నాదీయూరే. మీరెవరేమిటి చీకట్లో కూర్చున్నారే. పాములుతిరుగు తుంటాయిక్కడ. మనయింటిపేరు.

రమ—ఏదోపోనిస్తురు. మాకులగోత్రాలతో మీకేంపని? మీరిక్కడేం చేస్తున్నారు?

విశ్వ—పేరడుగుతే తప్పటయ్యా. మావాడివేమో కనుక్కుందామనుకున్నాను. నియోగులాయేమిటి బాబు

రమ—మేము వైదికి నియోగులము.

విశ్వ—అంటే?

రమ—అంటే మాకాభేదం లేదన్నమాట. అదీఇదీకూడా అవుతూ ఉంటాము సమయాన్నిబట్టి. మీరిక్కడేం చేస్తున్నారు?

విశ్వ—ఇక్కడ స్కూలులో తెలుగుపండితుణ్ణిగా ఉంటున్నాను.

రమ—అట్లాగండి. ఇంకాచెప్పరేం. తమకిజీతమెంత? విద్వాన్ pass అయినారా.

విశ్వ—పూర్వకాలం వాణ్ణిబాబు. విద్వాన్లకి చదువుచెప్పతాను ఇక్కడ వాళ్లెవరికి ఆమాట తెలియదు. అదికూడా తెచ్చి పెట్టుకండి చచ్చిపోతాను.

రమ—జీతం యెంతండి?

విశ్వ—తెలుగుపండితుడి జీతం ఎంతుంటుందో ఊహించుకోలేరూ? నాచేత ఎందుకనిపిస్తారు? ఏదోపదిరాళ్లిస్తారు. కొంత వైదీ

కంకూడా ఉండిగనుక రోజులు వెళ్లుతున్నాయి. అయితే మీ రెవరో చెప్పినారుకారు. నావద్దర నియోగం తీసేసి వైదీకమే అవలంబించుదూ పెద్దవాణ్ణి నీకేదయినా వీలయితే ఉపకారం చేస్తాను. మాస్టరీకోసమే వచ్చావా?

రమ—(తనలో) ఇంక ఈయనతో పెడసరంగా ఉండకూడదు. సంగతులన్ని దాబట్టాలి (ప్రకాశముగా) శాస్త్రిలుగారూ! మీదగ్గిర దాచడం యెందుకు మాది తెలగాణ్యం రమణరావు నాపేరు. జనమంచివారు. ఏదో కాస్త M. A. దాకా చదివాను. ఇక్కడేమయినా మనకిదారి ఉంటుందా.

విశ్వ—అదృష్టవంతుడవే నయ్యా, సెక్రెటరీకూడా తెలగాణ్యపు వాడే నక్కనితొక్కి వచ్చినావు. నీకు కావడానికేమయ్యా M. A. కూడా pass అయినానంటున్నావు. మహారాజులాగ. అయితే వక్కచిక్కుంది ఆయన పెళ్ళాంమాట వింటాడు. ఇప్పుడు ఆవిడద్వారా అనేకమంది వస్తున్నారు.

రమ—ఆవిడ దగ్గరకేదారి యెట్లాగండీ?

విశ్వ—అందుకనే లాభం లేదంటున్నాను. పాతఊళ్లో పడి కాపుల పడిఉన్నారు. 10 మంది ఇంటికొకడు చొప్పున ఎవరికవుతుందో తెలియదు.

రమ—మొంబళ్లో ఎవరండీ స్కూలుకమిటీకి?

విశ్వ—కోమటి సుబ్బిశెట్టి, కాఫీహోటలు అయ్యార్, కిరననాయల్ agent రంగరావు; మాగ్రామ పురోహితుడు విస్సయ్య, కరణం. కొంతమంది కాపులు అంతాచేరి పదిమంది ఉన్నారు నాయనా.

రమ—అయితే ఎవడికీ డొక్కశుద్ధి లేదన్నమాట.

విశ్వ—ఎవరూ లేరుబాబూ ఉంటే ఈకగ్నమేమి. రాజారావు

రొకరున్నారు. నాలుగింగ్లీషు ముక్కలు వచ్చిన పెద్దతల కాయగా.

రమ—ఆయనేమి pass అయినారు.

విశ్వ—పూర్వపు Matriculate ఇప్పటి S. S. L. C. గనంగాను.

రమ—పని?

విశ్వ—ఇప్పుడు పని లేదు. ఫించను తీసుకుంటున్నారు.

రమ—Government ఉద్యోగస్థుడేనండీ. ఏం పనిలో ఉండేవారు.

విశ్వ—తాలూకా గుమాస్తాగా ఉంటూ ఉండేవాడు. ఆయన ఒక్కడే pass అయినవాడు ఈ కమిటీలో కాని ఆయన ఒక్కడూ ఒకటి. ఆయన మాటేమి సాగుతుంది?

రమ—మీ సెక్రెటరీ గారేమి pass అయినారు.

విశ్వ—Supplementary మూడేళ్లు దండయాత్ర చేసి మానేసాడట. ఏదో Insurance company కి agent గా ఏడుస్తున్నాడు.

రమ—ఆయన పేరు?

విశ్వ—నరసింహాము పంతులు.

రమ—అయితే ఇప్పుడు సంగతి చెప్పండి. మళ్లీ వాళ్లందరూ వస్తారు. కార్యసాధనం అయేదారి చూడాలి.

విశ్వ—ఈ ఊళ్లో ఎవరినైనా ఎరుగుదురా?

రమ—ఎవర్నీ ఎరగను మిమ్మల్ని తప్ప.

విశ్వ—అయితే ఎట్లాగయ్యా, Drawing Master ఉన్నాడాయన ఓఢ్ర దేశపువాడు.

రమ—ఆయన recommendation కావాలా ఏమిటండి.

విశ్వ—అది దొరుకుతే ఇంకేముంది! మీ పని అమోఘంలెండి. ఆ drawing master ని వలలో వడేసుకుంటేనేగాని లాభం లేదు.

రమ—ఏమిటండి ఇందులో ఉన్న రహస్యం.

విశ్వ—మీకెందుకు ఆలోచలించడవలసినది. ఆయనా సెక్రిటరీ ఒక్కడే అనకోండి.

రమ—ఆయన ఈపాటికెవడికైనా recommend చేసిఉంటాడేమో.

విశ్వ—ఇంతవట్టుకు లేదు. ఆయనకి rocemmend చేయడానికి తగిన ధైర్యమెక్కడుంది? కొన్నిపిల్లు కనబర్చుతాడు. వెళ్లి ఆశ్రయిస్తే.

రమ—మరి ఆయన దగ్గరకు కూడా దారిచెప్పండి.

విశ్వ—మీరేమయినా డబ్బు తెచ్చారా?

రమ—ఎందుకు? లంచమివ్వాలా యేమిటి కొంపతీసి?

విశ్వ—లంచాలెక్కడివ్వగలము మనము. ఒకవీసెడు మిఠాయితీసి కెళ్లి ఈ రాత్రి ఎవరూ చూడకుండా ఆయన్ని చూడు. రాత్రికి మృగశిరకూడా వస్తుంది.

రమ—భేష్ గానివ్వండి. నాఏఆనక్షత్రమే

విశ్వ—ఆ!. అయితే వెళ్లకు కొంపతీశావు. జన్మతార.

రమ—జన్మతార అయితే ఏమండీ?

విశ్వ—కొంచెము శాంతిచెయ్యాలండీ. మీకు ఖర్చుకే వచ్చిందిది. పోనీ మానేస్తారా పెద్దవుద్యోగం. ఈ రాత్రిచూడకపోతే అదెవడో తన్నుకపోతాడు. చూస్తే మీకుపరాభవము. అపజయము రెండు చుట్టుకుంటాయి.

రమ—అయితే ఇప్పుడేం చెయమంటారు?

విశ్వ—ఏమి తోచడంలేదు నాకు పచ్చివెలగకాయి గొంతుక్కు పడింది (తనలో) పీడదగ్గిరున్నదం తాకువరం చేస్తాను. 10 రూపాయలు. ఇప్పుడు ముడుపుకట్టి వెళితే కార్యంనీవను కున్నట్టు అవుతుంది. రేపు వెంటనే గ్రహశాంతిచేసేస్తాను.

రమ—నేనుసరిగా 15 రూపాయలు తెచ్చాను. ఇంకా గ్రహాలెల్లా ఉన్నాయండీ.

విశ్వ—దివ్యంగా తిరుగుతున్నాయి. 5 రూపాయలు చాలవునీకూ వెళ్ళడానికి cycle మీద వెళ్లడానికి ఖర్చేముంది. 10 రూ. కోసం చూడబోకు. నిక్షేపంవంటి నౌకరీ. ఇప్పుడెక్కడా ఖాళీలు కూడా లేవు. ఉన్నదొకటీ పోగొట్టుకోకు.

రమ—సరే. ఈపదీ తీసుకుని రేపుచేయించెయ్యండి ఆలస్యం ఎందుకు?

విశ్వ—తెల్లవారకుండానే కానిచ్చేస్తాను. నీవింక త్వరగా వెళ్లు. ఆయన పెందరాళే పడుకుంటాడు.

రమ—దిత్తం తమరుదయచేయ్యండి. నాకుసెలవు.

విశ్వ—శుభమస్తు. ఇదిగో, అన్నట్టు మనగోత్రమేమిటి.

రమ—ఏదో నోట్లో ఆడుతోందండీ. ఎవరినైనా కనుక్కుందురూ. లేకపోతే శుభగోత్రే అని సంకల్పం చెప్పెయ్యండి.

విశ్వ—(తనలో) గోత్రంజ్ఞాపకము లేనివెధవలకి గ్రహాశాంతేమిటి? జ్ఞాపకం లేకపోతుందా? అదో తెగవల్లు. లోపలనమ్మకం ఏడిపిస్తూఉంటుంది. పై Superstition అని వెధక కబుర్లు చెప్పడం—అల్లా లేకపోతే నాలాంటివాళ్లు బ్రతకడం ఎల్లాగ? (పోవును).

(అంతట శ్రీనివాసరావు, వెంకటరావు, జోగరావు ప్రవేశింతురు).

జోగా—మీకు పెరుగు పోసింది నాకేమి వెయ్యలేదేమిరా?

శ్రీని—మేము ఆపత్రికార్థం యేర్పాటుచేసుకున్నాములే. కరణంగారింటికివచ్చాను. ఇంతపెరుగైనా పంపలేక పోయాడురా.

జోగా——నేను చూస్తూ ఉండగానే పంపినాడురా చురి. అదికాస్తా మరచిపోయి మీాయిద్దరికి పోసేసినట్టుంది దొంగముండ. అంతాపక్షపాతమే మీాకిద్దరికీ పీటవేసి సన్మానించ కూర్చో పెట్టిండి.

వెం——పోనీ లేరా, మనలోమనకే పోసిందికాని యింకోడికేవడికీ పొయ్య లేదుకదా! ఒకే సీసాగా డబ్బుకూడా యివ్వ లేనట్టుం దేమోగాని వ్వా.

శ్రీని——ఏమిసినట్టుంది కాగితం కాగితంగా దానిచేతిలో పెట్ట లేదుటోయ్ ... పలికి.

వెం——అంతా ఇచ్చేస్తే మరి Pocket money మాట.

శ్రీ——ఈ విధవ నోరికాడు కాదురా. రూపాయి మార్చి ఒక Akbar పెట్టె కొన్నాను. ఇంక ఈ చిల్లర వాడడగవచ్చాడా నేనిచ్చానా. ఏమండీ రమణరావు గారు! ఇందాకటినుంచి చీకట్లోనే ఉన్నారండీ? ఇదిగో Aabar పెట్టె తెచ్చాను. Scissors అయిపోయి నాయిట.

రమ——ఛీ, అవినేను వాసనయినా చూడను. మీారుతీసుకోండి దాన్ని. చిల్లర యిల్లాయివ్వండి నేను try చేసి తెచ్చుకుంటాను Coffee hotels కూడా తీసి ఉంటయీా ఒక Cup bed coffee కూడా వేసివస్తాను.

శ్రీని —చిల్లర లేదన్నాడండి. రూపాయి వాడిదగ్గరే పెట్టి వచ్చాను.

రమ——రండి ఒక్కసారి వెళ్లి వద్దాము. ఒక cup మీాకుకూడా ఇప్పిస్తాను.

శ్రీని——రేపు యిప్పించుదురు గాని లెండి.. ఇప్పుడింకో రూపాయి మార్చండి. ఏమి పోయిందింతలో. భుక్తాయాసంగా ఉంది నడవ లేకుండా ఉన్నాను. మేము ఈసత్రం అరుగుమీాదనే

ఉంటాము త్వరగా మాత్రిం రండి.

రఘు—అయితే సైకిలు చూస్తూ ఉండండి ఇప్పుడే వస్తాను. కొంచెము ఆలస్యమయినా మెళుకువగా ఉండండేం. (పోవును).

శ్రీని—ఒరేయ్. నేను ఈయన వెనకాలే వెళ్లి ఈయన movements watch చేస్తూ ఉంటాను. మనముచాలా Alert గా ఉండాలి. మీకు తెలియదు మనలో మనకి దేఖ రాదు. మనము గ్రూలోనూ ఎవడికో ఒకడికి అయితీరాలి. ఇంకోడికి కాకుండా చెయ్యాలి మనము. మనము 80 కి మాత్రం తగ్గనద్దు.

వెం—ఈ వెధవ మొనల్లో M. A. అంటూ వచ్చాడేమిటోయ్. మన ప్రాణానికి.

శ్రీ—Philosophy B. A. Inter తో సమానం. M. A. గనుక B. A. తో equal అనుకో పేరు గొప్పతే. మన మే నయము.

వెంక—recommendations కూడా ఉన్నాయిట కాదూ, ఈకాలంలో వాటికే యెక్కువ value.

శ్రీని—ఇక్కడ —వ్వేవీ పనికిరావులే. వీడింకా ఏమిచేస్తాడో అని భయముగావుంది. మీరిక్కడే ఉండండి. నేనిప్పుడే వస్తాను (పోవును)

వెం—ఏమిరా. జోగులూ, వెధవది Training రెండేండ్లయినా ఉందికా దేమిరా? ఇంకో మోడాది పాటు Stipend డబ్బులయినా వచ్చును.

చోగా—Uaemyloyed గా ఉండవలసి వస్తుందనేనా? ఏ office లోనైనను దూరవచ్చులెద్దు. graduateఅయాక ఏమిటారి అల్లాభయపడ తావు. Dont worry yourself పడుకొందాంరా.

(తెరపడును)

# పల్లెటూరి పాఠశాల.

## మూడవ రంగము.

---

[ప్రదేశము Drawing teacher గారియింటివీధి గదిలో]

(ప్రవేశము రమణరావు)

రమ—Drawing మేష్టరు గారున్నారండీ యింట్లో?

(తెరలో) ఎవరో కూర్చోండి వాకిట్లో గదిలో, భోజనము చేస్తున్నారు.

రమ—అమ్మయ్య,, ఉన్నారుగద (గదిలోకూర్చుని యుండును)

శ్రీని—(ప్రవేశించి) నేనూ ఈ అరుగు క్రిందనే చీకట్లో నిలుచుని వీళ్లమాట లన్నీ వింటాను.

(Dawing teacher ప్రవేశించును. రమణరావు లేచి నిలబడి నమస్కారము చేయును)

D. T.—(నమస్కారముచేసి) కూర్చోండి. ఏమివచ్చినారు?

రమ—కొంచెము తమతో పని యుండే వచ్చినాను లెండి. (పొట్లమిచ్చి) ఈపొట్లం జాగ్రత్త చేయించండి. ఏమిటో యథాశక్తి క్షమించాలి.

D. T,—ఇదేమిటిది. ఇదెందుకండినాకు? ఎవరైనా చూచినా బాగుండదు కూడాను.

రమ—అందుకనే అర్ధరాత్రివచ్చాను. ఇట్లాంటివి పుచ్చుకునేవాడికన్న ఇచ్చేవాడికే ఎక్కువ భయం ఉంటుందండోయ్ పెద్దలని చూచేటప్పుడు పట్టిచేతులతో రావడం భావ్యంకాదని మీకు కానుక తెచ్చాను కాని మరోమరో ఉద్దేశం ఏదీకాదు సుమండి.

D. T.—సరేకాని నేనుమీకు ఏమి ఉపకారం చేయగలనా అని ఆలోచిస్తున్నాను మీఅబ్బాయి ఎవడైనా చదువుకుంటు న్నాడా యిచ్చట? ఉంటేచెప్పండి promotion కి యిబ్బంది లేకుండా యిక్కడే నాలుగు మార్కులు సర్దేస్తాను.

రమ—అబ్బే వెధవడాయింగు మార్కు లెవడికావాలి. అదేది నాకక్కరలేదండీ. అంతకంటే గొప్పలాభం కోరివచ్చాను మీరుగ్గిరికి చేస్తానని promise చేస్తే చెప్తాను.

D. T.—సాధ్యమైతే నాకిబ్బంది లేకుండా ఉంటేచేస్తాను. ఏమిటో చెప్పండి.

రమ—అయితే చెప్పమన్నారా దాచకుండా? మీసెక్రెటరీవారితో చెప్పి నన్ను మీస్కూల్లో యెల్లాగయినా దూర్చాలి.

D. T.—అబ్బో! పెద్ద కోరికమీదనే వచ్చారు. ఏమి pass అయి నారండీ మీరు?

రమ—ఏమయితే ఏమిలేండి చెప్పుకుంటేసిగ్గు. పిల్లలకికావలసిన దానికంటే ఎక్కువేగాని తక్కువకాదు. M. A. అయినాను.

D. T.—M. A. అని యెక్కువంటున్నారేమిటి? Service ఎంత?

రమ—ఇద్దరాడవాళ్లకి 3 నెలలు private గా చదువుచెప్పాను అదే మయినా లెక్కలోనికి వస్తుందా?

D. T.—తరువాత ఎందుకు మానివేసినారు?

రమ—తరువాత వాళ్లు కాపురాలకివెళ్లి పోయినారు లెండి.

D. T.—మనదేయూరు?

రమ—మాదికోటిపల్లి.

D. T.—ఓహో! కూరుటండీ. మీరు philosophy M. A. కాదు.

రమ—అవునండీ! ఎల్లాకనిపెట్టినారు?

D. T.—మీ Applications అన్నీ receive చెయ్యడం నేనేనండి M. A. వాళ్లవి 10 వచ్చినాయి. అందులో మూడు B. L. fail అయినవాళ్లవి, ఒకాయన Practice చేస్తూ చేస్తూ గిట్టక L. T. pass అయి వచ్చినాడు. M. A. B. L. L. T. 50 రూ. కి life sacrifice చేస్తానంటూ ideals వ్రాసినాడాయన.

రమ—అబ్బా! ఇంకేమిటి వెధవ్రబతుకు సెక్రెటరీ ఏమన్నాడు దాన్ని చూచి.

D. T.—Application మీద అష్టవంకరగీతలు పెట్టినాడు ఆయనవేమీ చదవడులెండి. ముందు సంతకం చూస్తాడు. your most obedient servant అని ఉంటే చమవుతాడు లేకపోతే బుట్ట దాఖలా.

రమ—అరరే! law pass అయినాడు కూడాను application వ్రాయడమే తెలిసింది కాదండీ?

D. T.—తెలియకేం అదో పొగరు

రమ—నేను సరిగ్గా వ్రాసినానండీ?

D. T.—అది సరిగ్గావ్రాసినారు కాని పైన beg మరచిపోయినారు. దానికోసం చాలా ఆలోచించి, ఆలోచించి, ...

రమ—అఁ, చింపేసారా యేమిటి?

D. T.—వినండి. application వ్రాసేటప్పుడే ఇంత నిర్లక్ష్యం అయితే వీళ్లు పనేమిచేస్తారని సణుగుకుంటూ పారేసినాడు.

రమ—అయ్యో! అయ్యో! అదినేను నిజముగా overlook చేసినాను సుమండీ Testimonials కూడా add చేసినాను. అవ్వయినా చూశాడా?

D. T.—అవేవీ చూడడండిఆయన. Application లోనే పట్టేస్తా

డాయన సుశిక్షితయొక్క సత్తువ. beg, servant, obliged ఇవి ఉంటే కొంచెము పరీక్షలకు ప్రారంభిస్తాడు. అట్లా చేసినవన్నీ తిరగగొట్టేయడమే మీదినయం. కొంత వుండ బట్టి, నేను ఎంతో చెప్పబట్టి interview కి రమ్మన్నాడు.

రమ—ఇంకా Application ముచ్చటలు చెప్పండి విందాం.

D. T.—ఏముంది. అన్నీ నేనే sort చెయ్యడం. Typo చేసిన వాటికి ఎక్కువ value. spelling mistake ఒక్కటి వస్తే ఈడ్చేయండి వీణ్ణి అంటాడు మీరుకూడా ఏదో చిన్న మాటలో బోల్తాకొట్టినారు. Dictionary చూచి తప్పు పట్టినాడు కాని long life and prosperity అన్నారని నిదా నించాడు.

రమ—ఇంతకీ ఎన్ని application లు select చేసినారేమిటి?

D. T—100 వస్తే 25 చేసేటప్పటికి బ్రహ్మాండ మయింది. మీరు salary వేయలేదు నయమే. 70, 60 అన్ని వాళ్ల సందరనూ తోసిరాజన్నాడు. I leave it to you అన్న వాళ్లనే ఏరినాము. పాపం ఒకాయన 8 ఏళ్ల సర్వీసు 2 ఏళ్లు Headmaster కూడా ఏడిసినాడు పాపం.

రమ—ఏమయింది?

D. T.—I hop you will consider my case favourably అన్నాడు. అంత confidence ఏమిటి నౌకరీకోసం వ్రాసు కుంటూ అని చింపేసినాడా Application.

రమ—తరువాత?

D. T.—ఇంక దస్తూరీ గందర గోళాలు చెప్పనే అక్కర్లేదు. వీళ్ల Application లు చూడడమేనా ఏమిటి నాపని అని విసుగు కుంటూ చదివి చదవలేకపోతే చింపేస్తాడు.

రమ—నా దానికి అటువంటి దోషములు పట్ట లేదు గదా?

D. T—లేదు అందుకనే మీకు Interview, Interview లో మట్టుకు మీకు కొన్ని సంగతులు చెప్పాలి. మీకు ఉద్యోగం ముఖ్యంగా కావాలా? లేకపోతే Try చేసి చూద్దామని వచ్చారా?

రమ—అబ్బే! అయి తీరాలి లేక పోతే మల మల మాడి పోతాం గాని ఏమైనా ఉందా.

D. T.—అట్లా అయితే ఆయన వచ్చేటప్పటికి ఇక్కడే కనిపెట్టుకుండండి బండి గుమ్మంవద్దనే ఆగుతుంది. Trunk అదీ క్రిందికి దింపడానికి కొంచెము సహాయము చేయండి చిల్లర మార్పుకుని మాత్రము ఉండండి. వీలయితే బాడివాడికి డబ్బులు మీరేయిచ్చి పంపివేయవచ్చును.

రమ—ఈ రెండు రోజులు M. A., Pass కాలేదనుకుంటాను. మీరెట్లాచెపితే అట్లాచేస్తాను. ఇంకా ఆయన tastes ఏమిటండీ?

D. T.—ఆయనరుచులెరుగను మిఠాయి గిరాయి తేకండి. పిల్లా జెల్లాకూడా లేరు ఆయినికి

రమ—సంగతి చెప్పకోవడ మెట్లాగండి?

D. T—మీకు పొగడ్డం వచ్చునా?

రమ—తిట్టడం వచ్చును. ఎంతసేపు నేర్చుకుంటాను చెప్పండి.

D. T.—ఏమి అనవద్దు Application తీసి చదవమంటాడు. అప్పుడు అన్ని నేనే చెప్తాను. మీరునిలబడి ఆయనవేసే ప్రశ్నలకన్నిటికి వినయముగా సమాధానము చెప్పండి. పాగా పెట్టుకురండి. wrist wach ఇంత పెద్దదుం దేమిటయ్యా! moor market లో కొన్నదేనా? ఇది మాత్రం తేకండి. చేతి కర్ర యింట్లోనే పెట్టిరండి ఈకళ్ళజోడు షోకుకోసం తగిలించావా? లేక కళ్ళ జబ్బుందా? షోకైతే పెట్టుకురాకు. ఈ

యీన నవనాగరికుడే గాని ఇవన్నీ తెగనీలుగులంటాడు ఉద్యోగం అయిన తరువాత మీరాయిష్టంవచ్చిన ఆటలాడవచ్చును.

రమ—చిత్తం. తమరు మాత్రం అనుగ్రహముంచాలి.

D. T.—మరేమి భయములేదు వెళ్లండి. ఇదంతా యెవళ్లకీ తెలియనీయకండోయ్ బోలెడుమంది ఇక్కడ కనిపెట్టుకొని ఉన్నారు. మీరు నన్ను ముందుచూచినారు గనక చెప్పేశాను ఆగక. 25 మందికి మరునాడు వేలం.

రమ—గుండెలు కొట్టుకుంటున్నాయి. ఎట్లా గడుస్తుందో రేపొక్కరోజు.

D. T.—నాదగ్గరకు మళ్లీరాకండి. పగలు అసలేవద్దు. నాకు రోజుకి 90 recommendation letters వస్తున్నాయి ఒక్కదానికీ జవాబువ్రాయలేను. మీ అదృష్టం బాగుండబట్టి నన్ను చూచినారు.

(ఒకబవాను రెండు packet లు తెచ్చి యిచ్చి)

జవాను—సెక్రిటరీగారికి వచ్చినాయండి. మీకివ్వంచమన్నారు అమ్మగారు.

రమ—Applications ఏమో చూడండి అయిన ఆలస్యమెట్లాగూ అయింది.

D. T.—(చదువుకొని) ఇది Ceylon నుంచండి.

రమ—అబ్బా! ఎంతదూరాన్నించి వచ్చింది చదవండి చూద్దాం.

D. T.—As for my qualifications, I passed B. A., in first class.

రమ—అబ్బా!

D. T.—I am a specialist and medalist in economics

రమ—ఇంకా! చాలా అసాధ్యుడేనండోయ్.

D. T.—I am a research scholar and contributor to the historical reviews.

రమ—అబ్బా! ఎన్ని ఉన్నాయండీ.

D. T.—I took L. T. degree also with distinction.

రమ—ఇది కనబర్చకండి బాబు

D. T.—( చదివి ) ఆ, ఇంక భయములేదు. ఇదిగో వినండి I remain a bachelor devoted to the cause of education.

రమ—ఏమండీ, అయితేం?

D. T.—ఎందుకండి వెధవ qualifications అన్నిట్టుకొని పెళ్ళాంలేక పోయాక. ఇంక మీకు competition పోయింది లెండి హాయిగా సంప్రదాయండి. మా సెక్రిటరీ బ్రహ్మచార్లకివ్వడు.

రమ—రెండవదికూడా చదవండి చూద్దాం.

D. T.—ఇందులో మాత్రమేముంటుంది లేద్దురూ అయినా వినండి మీకెందుకా బెంగ. Having come to understand.

రమ—సరే. అది తీసెయండి మామూలుపాటే.

D. T.—I am a trained semigraduate having passed history

రమ—ఏమిటండోయ్. ఆచారవచూడండి. నాలాంటి వాడికే ఇంత భయము వేస్తుంటే

D. T.—ఇంకావినండి I am a little bist of an astrologer and palmist.

రమ—అదెందుకండీ యిక్కడ. వాడిసంగతివాడు predict చేసుకుంటే ఇల్లా వ్రాయకేపోను.

D. T.—I am a novelist too.

రమ—ఒక machine వ్రాస్తుందికey ఇస్తేసరి. అదో గొప్ప అనుకున్నాడు.

D. T.—I am a little bist of a phybician having got all

ayurvedic medicines. ఏదీకి తప్పకుండా అనుమోలాగుండండి ఎందుచేతనంటే ఈ ఊళ్లో తగినవైద్యుడు దొరక్క చిక్కు పడుతున్నారు. మా సెక్రెటరీ పిల్లానికి కడుపునొప్పి రోగం కూడా ఉంది. పైగా ఆతనికి జ్యోతిషమంటే పిచ్చినమ్మకము. ఈ రెండూ ఆయిన దగ్గర ఉన్నాయి.

రమ—దయచేసి మీరిది కప్పడతారా లేదా?

D. T—ఎట్లాగు? పెళ్లాంచెప్పదూ? రెండు packet ex వచ్చాయని.

రమ—ఏమిటీగతిమరి semi-graduate కాదు టండీ.

D. T.—అందుకనే మరీ chances ఉన్నాయి training కూడా అయినాడు. తక్కువకేవస్తాడు.

రమ—తక్కువకి నేనూవస్తాను. అది కాదు నేనుచెప్పేది. qulification ఏదీ అని.

D. T. మీకన్న ఎక్కువేలెండి. మీరు Inter History ఆయన B. A. history. ఆయన trained. మీరు untrained. మీ philosophy M. A. ఎవరికీ అక్కర్లేముగదా. ఎవరెక్కువో మీరేచెప్పండి

రమ—అబ్బా! ఆయనేనండి బాబు. దీనికేమయినా మందు వెయ్యాలి మీరు.

D. T.—(చదివి) ఆఁ మరి భయము లేదు వినండి. I belong to Kumbhakonam దీనికి మా సెక్రెటరీ ఒప్పుకోడులెండి తెలుగు వాళ్లకే ఇస్తాడు ఆయిన ఇదిముందు చదువుతానులెండి. అవతల పారవేయ మంటాడు.

రమ—అమ్మయ్య, రెండూ రెండు గండాలేనండీ. ఏలావచ్చాయో అట్లాగే పోయినాయి పాపము వాటంతటవి. నేనుకూడ ఏదైనా చెయిచూచి చెప్పనా ఏమిటండీ.

## మూడవ రంగము

D. T — మీకేమయినా చేతవునా?

రమ — ఆయనకు చేత గాదుగా. మనకి రాకపోతేనేమి? [illegible]
మీకు కొడుకు పుడతాడంటాను

D. T. — సరి మంచిది. సంతోషాన్ని పట్టి ఆడండి మీరాయిష్టము
వచ్చినట్టు.

రమ — ఇంకనాకు సెలవిప్పించండి. తిరిగి దర్శనం చేస్తాను.

D. T — చిత్తం ఇక్కడి మాటలు ఇక్కడే మరచి పోవాలి
సుమ

రమ — మీకే తెలుస్తుంది నా సంగతి క్రమముగా దయ ఉంచండి
పోతాను (ఇద్దరు పోదురు)

శ్రీని. — (మధ్యకు వచ్చి) అంతా విన్నానుకదా! ఒక నాటకం ఆడిస్తాను.
ఇక్కడ ఉద్యోగం సంపాదిస్తేనే వాంఛ (పోవును)



# పల్లెటూరి పాఠశాల.

## నాలుగవ రంగము.

---

[(ప్రదేశము). సత్రము అరుగు. ప్రవేశము వెంకటరావు, జోగారావు, ఉండగా, శ్రీనివాసరావు ప్రవేశించును]

వెం—ఏమిరా, ఇంతఆలస్యంగా వచ్చావు? ఎక్కడికి వెళ్లావయ్యా

శ్రీని—ఏమోరా, చచ్చాను ఊరంతా వెతికి లేక ఇట్టే మాయమైనాడు అక్కడితోటి ప్రాణంవిసిగి కరణం గారింటికెళ్లినాను ఏమయినా ఇక్కడి సంగతులు చెపుతాడేమో నని.

(రమణరావు వచ్చును)

వెం—ఇదిగో ఈయనావచ్చాడు. ఇద్దరు ఒక్కమాటే వచ్చారు.

రమ—(శ్రీనివాసరావుతో) మీరెక్కడికి వెళ్లినారు?

శ్రీని—కరణం గారింటికి లెండి.

వెం—ఏమండి M A గారూ M. A. కి private గా కట్టితే ఏమైన chances ఉన్నాయాండీ?

రమ—ఎందుకు పోనిద్దురూ, వెధవ M A ఏం లాభముంది ఈసత్రం అరుగుమీద దొర్లడమే కాదూ?

వెం—అదేమిటి. మీరు philosophy M A కూడాను కర్న Theory లేదాఏమిటి మీ course లో ఎక్కడి కక్కడ సరిపెట్టుకోవాలి? scissors దొరికాయూ.

రమ—లేదండి. ఈఊళ్లో వెధవనిగరెట్టు పెట్టికే కరువుగాఉంది. ఇక్కడ ఉద్యోగం చెయ్యడం ఎలాగు

శ్రీని—అప్పుడే ఉద్యోగం చేస్తూన్నామనే ఆలోచిస్తున్నారన్నమాట ఆలు లేదు. చూలు లేదు

వెం—ఆ రెండూ వున్నాయేమో నీకేమి తెలుసును.?

శ్రీని—మొదటిదుంటుంది సందేహము లేదు. ఏమండీ రమణరావు గారూ! అయితే మీ సెకు మిఠాయి మీరొక్కరే తినాలండీ?

వెం—మీ సెకు మిఠాయి యేమిటోయ్.

శ్రీని—మిసెకు మిఠాయికొని పరుగెత్తాడటారి నేనుసిగరెట్టు ముట్టించుకోడానికి ఇట్టుకుకాణం మీదికి వెళ్ళేటప్పటికి యెవరండీ ఆ gentleman ఇప్పుడు మిఠాయికొన్నాడూ అని అడిగారు నన్ను. ఏమండీ! అవునా కాదా?

రమ—ఏమో! ఎవరో, నేనేనన్న మాటేమిటి?

శ్రీని—సైకిల్ కట్టు, Silk కండువా, కాళ్ళజోడు, wrist watch cropping ఎవరికున్నాయయ్యా ఇక్కడ.

రమ—కొనేసానండీ. వెధవది వెర్రిఆకలేసింది అంతాతినేద్దామనిపించింది

జోగ—అంతా వక్కళ్ళే తిన్నారండీ?

రమ—మీ సడంటే ఎంతండీ. కొంత అక్కడెవడికో పెట్టేసానులెండీ.

జోగ—ఒరేయ్ ఈయన్ని నమ్మకూడదురా. ఈయన Philosphy M. A. చూడెంతపనిచేసినాడో. మనకిచెప్పనైనా చెప్పలేదు.

రమ—ఏముందండి చెప్పడానికి బ్రహ్మాండం. సరే మీరుయిష్టంవచ్చినట్టనుకోండి.

వెం—సరే పోనిద్దురూ తింటే తిన్నారు. క్షమించండోయ్ ఊరికే liberties తీసుకుంటున్నాం మీతోటి. ఒరే కరణంగారేమన్నారురా ఇక్కడి వ్యవహారం.

శ్రీని—జాగ్రత్తగా చెవులు నిక్కపొడుచుకొని వినండి చెపుతాను. బలేఅద్భుతంగా ఉంది ఇక్కడిచర్య. కరణానికి సెక్రటరీకి పా

ట్లీలట. సెక్రెటరీ ఇంటి కెదురుగానే Drawing master ఒకాయన కాపురమున్నాడట. పాపం సెక్రెటరీకి మాష్ట్లంటే చాలాఇష్టము. వాళ్లందరికి family portions కట్టించేసి తానుకూడా అక్కడ ఉందామని ఆయన ఉద్దేశ్యమట.

వెం—పనిఇవ్వడంమాట ఏమిచెప్పాడు చెప్పుదూ.

శ్రీని—చెప్తాదిగిను. ఆ Drawing వాడికి కావలసిన వాడెవడో ఒకడున్నాడట. B. A. అయిందటకాని Training కాలేదట. వాడికెట్లా అయినాచెప్పి ఆపోస్టిప్పిద్దామనుకుంటున్నాడట. తప్పకుండగా వాడికే అవుతుందిట పైవాళ్లకి governor recommend చేసేది ఇవ్వడట. ఏమండీ రమణరావుగారూ! వింటున్నారా, నిద్రపోతున్నారా?

రమ—లేదులేదు. నిద్రయెక్కడ, వెధవనిద్ర చెప్పండి చెప్పండి.

వెంక—మరిఆయన్ని పడదామా ఏమిటి?

శ్రీని—ఆయన ఒకడి కోసం చూస్తుంటే. ఏడిసినట్టుంది నీ తెలివి. పైగా ఆయన ఏం చేస్తున్నాడో తెలుసునా? ప్రతివాడిదగ్గరా లంచాలు దొబ్బి—లంచాలంటే ఆఖరికి మిఠాయి అయినా లంచమేసుమా—ఎట్లాఅయితే పనికాదో అవన్నీ చెపుతూ ఉంటాడట.

రమ—ఏమిచెపుతా డేమిటండీ?

శ్రీని—ఆ details ఎందుకులెండి మీకు,

రమ—(ఆతురతతో) చెప్పండి విందాం నిద్రరావటంలేదు చాలా Interest గా ఉంది.

శ్రీని—ఎందుకు పోదురూ, వెధవగొడవ. పొద్దుచాలాపోయింది.

రమ—మచ్చుకి ఒక్కటి చెప్పండి పడుకుందాం.

శ్రీని—మరేమిటటా సెక్రటరీకి వంగి వంగి సలాములు చేయమంటాడట. ఆయనకు అది తలకాయనొప్పట వీడు Self respect తెలుసుకోకుంటా ఉన్నాడు. ఇల్లాంటివాడు Students ని ఏముద్ధరిస్తాడు, దయచెయ్యండి తాలూకా గుమాస్తాగా చేరండి అనిచెప్పుతాడట.

రమ—ఆఁ. మరెట్లా ఉండా లేమిటండి.

శ్రీని—వినండి ఏమిటంత Interest తో అడుగుతున్నారు?

రమ—అబ్బే! ఏమీ లేదు చెప్పండి.

శ్రీని—ఆయనదగ్గఱకు ఎంత షోకుగా, ఎంతSpirited గా వెళ్లి ఎంత Independent గా behave చేస్తే అంతplease అవుతాడట.

రమ—(ఆశ్చర్యముతో) ఆఁ ఆఁ నిజమేనండీ?

శ్రీని—నిజమేనయ్యా, నాకేంబట్టింది మీతో అబద్ధాలు చెప్పడానికి ఇంకా ఆయన Idiosyncracies చాలా చెప్పినాడు జ్యోతిషమన్నా చెయిచూడ్డం అన్నామహామంటట ఆయనకి. దూరంగాపొండి నాదగ్గర చెప్పకండి అమాటలంటాడట.

రమ—ఇంకా?

శ్రీని—కూర్చోమనడట ఎవర్నీని. మనంకూర్చుంటే ఎమీ అండట. పైగా తగ్గవాడే అంటాడట.

రమ—కొంచెము వినయముగాఉంటే ఏమంటాడో?

శ్రీని—చెప్ప లేదటయ్యా; "నువ్వేం beggar విటయ్యా, B. A. pass అయి కాస్త dignity maintain చేసికోవడం తెలియదూ? నీదగ్గర చదివేవాళ్లు గుమాస్తాలకి తప్ప ఎందుకూపనికిరారు" అనిబాగా dose ఇస్తాడట.

రమ—ఆ drawing teacher ఏమనిచెప్తాడు అందరితోటి.?

శ్రీని—ఏముంది చేతులు కట్టుకు నిలుచో అంటాడు. చెయిచూచి నాలుగు ముక్కలుచెప్పండి అంటాడు.

రమ—అయితే ఆయన చెప్పినదానికి opposite గా చెయ్యాలన్న మాట.

శ్రీని—quite opposite గా చెయ్యాలి. మీరు experiment చేస్తారా యేమిటి? వెడితే wrist watch తీసేసి మరీ వెళ్లండి బాబూ. కావలిస్తే నాదితీసుకోండి ఈ రెండురోజులూ. నా కుఆట్టే వీటిమీద భ్రాంతి లేదు. మీది చూడలేకుండా ఉన్నాం (wrist watch ఇచ్చి) ఈమాటుమీకు సరిపోయింది ఇది. ఈవేషంతో వెళ్లితే తప్పకుండా అవుతుందయ్యా నీకు పని.

రమ—వేషంచూచి ఇచ్చేవాడెవడండీ మీరూరికే అంటారుగాని.

శ్రీని—జోగులూ, వెంకటాద్రీ, అరే! అప్పుడే నిద్రపోయారూ!

వెం—మెళుకవగా ఉందిరా. అన్నీ వింటున్నాను. మహాబాగా ఉంది ఇక్కడనోడవ. ఇక్కడికి కాపురంతో రావడం ఎట్లాగాఅని ఆలోచిస్తున్నాను.

శ్రీని—రేపొక్కరోజు. ఎల్లుండి ఆభాగవతంచూచి మరీపోదాం L. T. ల సంత. పృధ్విలో ఎక్కడాచూడం కళ్ళేట్టుకుని. పడుకో పండ్రెండయింది.



# పల్లెటూరి పాఠశాల.



## అయిదవరంగము.



[ప్రిన్సిపాల్ సెక్రటరీగారి యింటి అరుగు]

(ప్రెసిడెంటు నరసింహము పంతులు, and Drawing teacher.)

నర—యింకా యేమిటండీ విశేషాలు. ఇక్కడే కూర్చున్నారేం పొద్దున్నే?

D. T.—మీరు వచ్చేవేళయిందని కనిపెట్టుకున్నానండీ. కొత్త Application కి briefs తయారు చేస్తున్నాను. రేపుకమిటీ మీటింగు కాదటండీ. L. T. అందరూ వచ్చి కనిపెట్టుకు కూర్చున్నారండీ సత్రములో.

నర—ప్రతిపత్రికలోనూ వేశారండీ. ఏమిటిప్పా ఊరిపోతున్నాను. నాకొకటి తోస్తూందండీ. Staff అంతనీ wholesale గా remove చేసేసి కొత్తవాళ్ళ నెక్కిస్తూఉంటాను. ఎప్పటికప్పుడు up to date గా ఉంటుంది Institution. L. T. వాళ్ళయినందుకు rust పట్టుకుంటా చాలామందికి Teaching కి మనము Scope ఇచ్చినట్టూ ఉంటుంది. ముఖ్యముగా మనకి నెలవుల్లో జీతాలు కలిసివస్తాయి. March దాకానే appointment.

D. T.—Short term దాకానే అనవచ్చుకూడాను. January తోటి courses అన్నీ అయిపోతాయి. Head master యింక క్లాసుకొకరూ ఉంటే మెల్లాగో manage చేసుకొంటాము. దానికి Headmaster మీ viewsతో Coincide అయేవాడవ్వుతే లాభం.

సర—అదే నేనూ ఆలోచిస్తున్నాను. పాత graduate మాపిన మామగారో కాయం ఉన్నాడు. అయినన్నిక్కిస్తాను. పడి ఉంటాడు. retired bench Clerk. objection ఏమైనా ఉంటుందాగారా.

D. T.—మీ ఇష్టం. పాపము పాత Headmaster చాలా కాలము నుంచి కనిపెట్టుకొని ఉన్నాడు.

సర—అందుకనే ముఖ్యముగా తీసివెయ్యాలి. 3 ఏండ్లకన్న ఎక్కువుంటే Master old ideas పట్టిపోయి పాడవుతాడు. Change చేస్తూఉండాలి ఎప్పటికప్పుడు ఆయనకి Notice వ్రాసియ్యండి పంపిచేద్దాం ఇప్పుడే.

D. T.—grounds ఏమి పెట్టమంటారు?

సర—grounds పెట్టితే రాలా ఏమిటండీ? పెట్టనిది గాదా ఏమిటి. మనసొకరిని మనము తీసివేసేటప్పుడు. మనకు భయమేముంది? నిజము వ్రాయండి. మీరు మా institution లో చాలాకాలమునుంచి ఉంటున్నారుగనుక, క్రొత్తవాళ్లు చాలా మంది unemployed గా ఉన్నారుగనుక వాళ్ళకి మేము chances ఇవ్వదలచుకొని మిమ్ములను ఇందుమూలముగా తీసివేయడమైనది.

D. T.—చిత్తము.

సర—క్రొత్త application లు ఎన్నివచ్చినాయి నేను వెళ్లినతరువాత?

D. T.—రెండేవచ్చినాయండి.

సర—పర్యవసానము చెప్పండి టూకీగా.

D. T.—ఒకడు bachelor vow తీసుకొన్నాడటండి.

సర—సరే తీసివెయ్యండివాణ్ణి. అటువంటి బ్రహ్మచార్లు ఎవరున్నా

రిప్పుడు. ఎవళ్ళో ఇద్దరు ముగ్గురు తప్ప. బ్రహ్మచార్లమని పేరెట్టుకుని లోకముమీద పడడానికి. రెండోది ఎక్కడ నుంచి.

D. T.—కుంభకోణం నుంచండి.

నర—ఓయి బాబో, చింపేసారా లేదా అదింకా. List వచ్చినట్టున్నది. మనస్కూలో ఎంతమంది pass అయినారేమేడు?

D, T—ఒకడూ లేనట్టున్నది. Second listలో ఏమైనా ఉండవచ్చు.

నర—ఊం. ఈ యేడుకూడా నిల్లేనా (Nil) యేమిటి? ఏమి చెపుతు [illegible] గ్యారాల్క వెధవచదువు మీరందరూ పడుకుని కునికిపాట్లు పడుతుంటారా యేమిటి క్లాసులో. అ యేడబ్బు అవుతోంది మాకు.

D. T.—తరువచ్చి తణిఖీ చేయించండి వక్కమాటు ఈ యేడు యెక్కడా అట్లాగే ఉన్నాయిండి. పేపర్లన్నీ చాలాకష్టంగా ఉన్నాయిటండి.

నర—సరే యింక మీరు దయచెయ్యండి నేను కాసేపు rest తీసుకోవాలి. ఇంకో sentence కూడా add చెయ్యండి ఆనోటీసుకి. ఈయేడు results Nil గనుకనున్నూ మీకు నోటీసు అందజేయుడమైనది. ఈమాటు grounds బాగా ఉంటాయి!

D. T.—చిత్తం బాగుందండి (పోవును)

( శ్రీనివాసరావు ప్రవేశము. )

శ్రీని—నమస్కారమండి.

నర—ఈనమస్కారాలందుకోలేక చచ్చిపోతున్నాను. ఈ రోజు బస్సుచుట్టవేసి దిగనిచ్చారు కారేమిటండీ వెధవలంతాను. మనదేయూరండి?

శ్రీని—మూడిక్కడే లెండి. పిఠాపురం B. A. pass అయినాను. Training కూడా అయినానండి.

సర—అయితే ఏమంటావు?

శ్రీని—తమదర్శనానికి వచ్చానండి

సర—ఎందుకో చెప్పవయ్యా?

శ్రీని—ఎంకునుందండి మాష్టరీకి దరఖాస్తు చేసుకొన్నానండి. గమ్మనుని కాస్త దయచేసారండి.

సర—రేపు కమిటీ మీటింగు. అక్కడికి తీసుకురండి మీరంతాను. ఒక్కొక్కళ్ళనే పిలుస్తాం.

శ్రీని—చిత్తం. ముందుగా తమకీసారి మనవిచేసుకొంటే మంచిదని వచ్చానండి.

సర—నాకెక్కడ జ్ఞాపకం ఉంటాయండీ మీ పేర్లన్నీని. ఇండివాళ్ళకి డబ్బులు యిచ్చింది మీరేకాదు?

శ్రీని—దానికేంలెండి అదెంత.

సర—అందుకోసంకాదు. నాకు జ్ఞాపకం ఉండడానికి మీరు L. T. అయినారా? Trainingఅయినారా?

శ్రీని—L. T. Training అయినానండి. L. T. తప్పినానండి.

సర—అవడం ఏమిటి, తప్పడం ఏమిటయ్యా అబ్బాయిగారు పడతావేమిటి నాదగ్గరకూడాను. రేపు కమిటీలో సాగదీసేస్తారు. తెలిసిందా? సరిగ్గా చెప్పు అయిందా, లేదా?

శ్రీని—డీంట్లో రెండున్నాయిలెండి, L. T. అనేది డిగ్రీB. A. వంటిది. అదిఅవలేదు నేను, Training course complete చేశాను.

సర—ఎందుకా వెధవ course డిగ్రీ లేకపోయాక.

శ్రీని—దీనికి course మాత్రం మీ ప్రధానంలెండి

నర—(తనలో) ఏమిటో వెధవగోడవ నాకు తెలియడంలేదు. (ప్రకాశం) సరే రేపటిదాకా కనిపెట్టుకుండండి తెలుస్తుంది

శ్రీని—చిత్తం. (నిలబడియుండును)

(బంట్రోతు చీటి తెచ్చియిచ్చును)

నర—(చూచుకొని) ఈయనెవరో యిప్పుడే ఓడదిగి వచ్చినట్టున్నాడు. visiting card ఈయనా. ఉద్యోగంకోసంవచ్చి ఈ వెధవ పెట్టు తేమిటి. ఇక్కడ పడనమను.

(రమణరావు ప్రవేశించి)

రమ—good morning Sir.

నర—ఇంకా మోర్నింగేమిటి; పండ్రెండుదాటితే. wrist watch కూడా తగిలించావు Time తెలియదటయ్యా.

రమ—first time meet అయినప్పుడు అట్లాగే greet చేస్తారు లెండి.

నర—ఇందాకా బంట్రోతుకు ఒకసారి కనిపించావు కావు. ఎప్పటికి కిప్పుడే first సమయమేమిటినీకు నీవుమానౌకరీ చేయడనికి వచ్చినవాడవేనా?

రమ—I come to serve as a teacher

నర—అవునయ్యా అదిమాత్రం నౌకరీకాదా యేమిటి. మీ qualifications ఏమిటి. మీకుకూడా Interview ఇస్తామన్నామా యేమిటి.

రమ—Yes, I Passed M. A.

నర—మీకివ్వం పొండి.

రమ—ఎందుచేత?

నర—మాయిష్టం.

రమ—మరెందుకురమ్మన్నారు చూడనికి?

నర—చూడకుండా గేదెను నీళ్ళలో పెట్టి బేరమాడేమిటి.

రమ—ఏమిచూశారు మీరు?

నర—ఏం మాటకి మాట ఎదురు చెపుతున్నావేమిటయ్యా. ఏఊరు మీది? పట్నంటూరుఉంటే మాకేంబలవంతమా యేమిటి. అసలే ఇక్కడివాళ్లకి చదువుతక్కువ గోలెక్కువాను. మీరు Teacher అవుతే ఇంక చెప్పనే అక్కర్లేదు.

రమ—(శ్రీనివాసరావునుచూచి తెల్లబోయి) ఆగినపన్నకడుపు మాడ, వీడు నన్నిల్లారమ్మని తానెట్లా తయారయినాడో. Science Master చెప్పినమాట నిజమే. (ప్రకాశము) ఈ వేషమంతా తమదగ్గర గనుక వేసినానులెండి.

నర—నాదగ్గరే వేసినవాళ్లు కేపిస్కాల్లో వెయ్యరూ. ఏకోకొంత జరుగుబాటున్న వాళ్ళకి మేము ఇవ్వదలచుకోలేము. ఇస్తే అటువంటి వాళ్ళకిస్తే పుణ్యం పురుషార్థం. మీకంటె ముందుగావచ్చి యెట్లానిలుచున్నాడో చూడండి. మీరిట్లా కూర్చున్నారు. వినయం తెచ్చిపెట్టుకుంటే రావండీ. చూచి చూచి నేనుకొనలేకుండా ఉన్నాను wrist watch. ఉద్యోగం లేక అఘోరిస్తూ మీరిట్లా తగిలించారు.

రమ—పెద్దమనుష్యులదగ్గరకు వచ్చేటప్పుడు కొంచెము వేషముతో వెళ్ళవలెనని యివన్నీ యెరువు తెచ్చుకొని వచ్చానులెండి. లేకపోతే Wrist watch నేనుకొనగలనాండీ.

శ్రీని—(తనలో) వీడుకొంపతీసి ఈవాచీ నాదనిచెప్పడుగద.

నర—వాచీ యెరువేమిటండీ? అంతా ఎరువుమనిషిలా ఉన్నావేమిట.

య్యా. లేపు మీయింటికిరండి మీరు పొండి. M. A.
pass అయినాను కాదూ. తప్పకుండా Chances ఉంటా
యిలెండి వెళ్ళండి. (రమణారావు పోవును). (శ్రీనివాస
రావుతో) పెద్దమనుష్యులదగ్గరకి వచ్చేటప్పుడు యిట్లాగేనట
య్యా రావడం. సిగ్గులేదూ? పాపం ఆయన్ని చూడండి ఏ
మీ లేకపోయినా ఎరువైనా తెచ్చి యెట్లాపెట్టుకొన్నాడో!
దరిద్రము ఓడుతూన్నస్టే students లో మీకేం Personality
ఏముంటుంది. పాగాపెట్టుకొని వొండునా వేసుకుంటేనే మాస్టరీ
దర్జా ఉండనుకోండి. ఇట్లాగుంటే ఏడిపించేస్తారు పట్టుకొని.
దయచెయ్యండి పెందరాళే. మీకేమీ Chances లేవు.

శ్రీని—అరే ఏమిటండీ యిలాగంటారు. నాను trained అయి
నాకాలేదు. పైగా వేదాంత philosphy M. A. M. A. Pass
అయినవాళ్లకి High school classes handle చెయ్యడమంటే
below the dignity అనుకుంటారు. స్కూల్లు అంటే
నే వాళ్ళకి చీదర. Teaching అనేది ఒక art లెండి
M. A. లకి వాగడం తప్ప ఇంకొకటి తెలియదు. కాలేజీలో
మొక్కడైనా దొరికితే తప్ప High school కి apply చేస్తారే
మో మీరే చెప్పండి. ఎరువు బట్టలు వేసుకొంటే అయిం
దా ఏమిటి పిల్లలకి తెలిసిందంటే గేలిచెయ్యరూ, ఉన్నదానితో
కాలక్షేపంచేస్తే ఉన్నగౌరవం ఎందులోనూలేదు. Head-
master కంటె qualification లో ఒకటితక్కువుండాలి గాని
మొక్కువుండకూడదు. ప్రతిదానికీ దెబ్బలాడుతూ ఉంటా
డు. work సాగనివ్వడు మీయిష్టం

వర—ఏమిటోనండి నాకేమీతోచడంలేదు. మీరు వెళ్ళండి ఆలో
చిస్తాను.

శ్రీని—చిత్తం. రేపుదర్శనంచేస్తాను,

నర—తప్పకుండారండి (శ్రీనివాసరావు పోవును).

(ఇంకొక అభ్యర్థి కొండలరావు ప్రవేశించును.)

నర—ఏమండీ! మీరెవరూ, త్వరగాచెప్పండి చంపక ఉద్యోగానికేనా?

కొం—చిత్తం. నన్నుకూడా రమ్మన్నారండి.

నర—నాకుజ్ఞాపకమూ ఏమిటి మీరెవరో. అసలు ఆపోస్టు ఇప్పుడే వరికీఇవ్వం. ఉన్నవాళ్ళనే సర్దుకుంటాము. సొమ్ములేకుండా ఉంది స్కూలుకి. మీరేం pass అయినారు?

కొం—B. A. 1st class అండి.

నర—1st class కి ఏమితేవన్యూ, Professor దయుండేం సరే. Training అయినారా?

కొం—Next year అవుతానండి.

నర—next year మళ్లీఇంకోక్క appoint చేసికోమా? ఇదేపనేమిటి మాకు? ఏకంగా training అయిపోక యెందుకీ వెధవతంటాలు మాకు దండుగకా?

కొం—కాదండి. ఒకయేడయినా Service లేకపోతే training లో చేర్చుకోమన్నారండి.

నర—training కాకపోతే మేము చేర్చుకోమన్నామని చెప్పండి. వాళ్ళకన్న తక్కువా యేమిటి మేము. ఒకయేడయినా teaching లెక మరలోనుంచి ఇప్పుడేఊడిపడ్డావా? దయచేయి

(కొండలరావు పోవును. తెరపడును.)

# పల్లెటూరి పాఠశాల.

ఆగవరంగము.

---

[ప్రదేశము సెక్రెటరీగారిల్లు]

( ప్రవేశము కమిటీమెంబర్లు. )

నర—స్నేహితులారా! ఇప్పుడు మనము Meet చేయుటకుద్దేశ్యము ఒక History L. T. ని appoint చేయుటకైయున్నది. అది చేయుటకుముందు ముఖ్యముగా పాత Headmaster దగ్గర నుంచి ఒక అర్జీవచ్చినది. ఆయన్ని తీసివేసినాము తిరిగి ఆయన ఒక అర్జీ పెట్టుకున్నాడు. అదియిప్పుడు సభవారువిచారణ చేయవలసిఉంటుంది.

కాపు—విచారణేంటండి? మీరుతీసేసారు మేముఅడ్డం చెపుతామా యేమిటి ఇంకోళ్లెవరో ఎవరొస్తారు

నర—అట్లాకాదు. నలుగురూ వప్పుకుంటే దాంట్లో ఏమీఆక్షేపణ ఉండదు.

కాపు—తీసేయ్యండఆర్జీ. దాన్నోకనిపిస్తే దణ్ణమైనా మెట్టడు. ఎందుకు మా మెంబరీ

నర—ఏమి సభవారి అభిప్రాయము.

వెంకన్న—ఎంత కలిసివస్తుందిమనకి

నర—ఆజీతానికి ఇద్దరువస్తారు.

సుబ్బి—లాగెయ్యండి. చూస్తారేం ఇంకాఎందుకనుమానం?

నర—ఏమండి విస్సయ్యగారు మీఅభిప్రాయం.

విస్స—నాకేమిలాభంలేదు వాడితోటి వాళ్లింటో ఎప్పుడూతద్దినాలైనారావు.

నర—ఏమండీ రంగారావుగారు ఊరుకుంటారేం?

రంగా—తీసెయ్యండి. ఎప్పుడూ ఒక్కడుంటే ఏమిబాగుంటుంది.

నర—ఇందుకు వ్యతిరేకులెవరైనా ఉంటే చేతులెత్తవచ్చును.

రాజా—ఆయన చేసిన తప్పు సెలవిస్తారా కొంచము?

నర—నిరుడెవరూ pass కాలేదండి సూళ్ళల్లో

కాపు—ఊం. ఇంకాఏ మొగంపెట్టుకొని అడ్డుపెట్టుకున్నాడయ్యా. నేనప్పుడెప్పుడా గదిలోనే కూర్చుంటాడు. క్లాసులో ఉండనే

రాజా—నేనుమాత్రం against అండి.

నర—అయితే Majority ఉందిగనుక అతన్ని తీసివేయడమైనది. ఇంక ప్రస్తుతంసంగతి కొత్త appointment చెయ్యడానికిముందు మాపిన మామగారిని Headmaster గా appoint చేయడమైనది.

కరణం—Non-Brahmin ఎవరూ అక్కరలేదా!

నర—Non-Brahmin మేస్త్రీ కేవలం కాదండి.

కరణం—paperలో వేయించిచూడాలి

నర—అందాకా పనిజరగడం కష్టమండి.

కరణం—Temporary గా Drawing master ని వప్పుకోమనండి దానికి.

నర—చిత్తం కమిటీవారియిష్టం. దానికి మీఅందరి అంగీకారము సూచించవలెను.

(రాజారావుతప్ప అందరు చేతులెత్తుదురు)

కాపు—నీవుకూడా ఎత్తవయ్యా, నువ్వేమిటి మాకు శకునపక్షిలాగ

రాజా—వెనుకటిఆయన చాలాకష్టపడుతుండేవాడు. ఆయన్ని తీసివేయడ

మనేది చాలఅన్యాయము. ఆయన ఉసురుగొటితే మనము బాగుపడము. చాలాయోచనము ఆలోచించుకోండి. వయసు ముదిరిన ఆయన ఇంకోచోట దొరకడు. మనకుకొంచెము ధర్మబుద్ధిఉండాలి, బూటకముగా తీసిపోతే 10గా తక్కువకి అడగండి ఆయనేవస్తాడు.

కరణం—మీరుచెప్పినదేమీ సబబుగా లేదు. మేష్టర్లకింతమంది పిల్లలేమిటిమందు. ఇంకొంచెమనుకోమి preparation చేస్తాడింటో. ఎప్పుడూ వాళ్ళతోనే సరిపోతుంది. ఇక్కడపని చేసే మాష్టర్లెవరికీ పిల్లలుండకూడదని ఒక resolution draft చెయ్యండి సెక్రటరీగారు

నర—చేసినానండి. అదిముందువస్తుంది.

కాపు—సరే ఆHeadmasterని తీసేసన్నా. ఇంక వెనక్కి వెళ్ళకండి. Drawing masterని ఆpost ఇచ్చేసాము.

(ఒకరు వచ్చి)

కోమటి సుబ్బిశెట్టిగారొచ్చి నిన్నుంచున్నారండి మరొకామీద ఎవరూ లేరంటండి. పోరాలు పోతున్నాయట

నర—సుబ్బిశెట్టి నీవు వెళ్ళు. మేముచూసుకుంటాము నీవన్నిటికి కంకరేగా.

సుబ్బి—చూచుకోండి బాబు. నాకువద్దు ఈవెధవగొడవ. అయన్ని మాత్రం మళ్ళీ వేసుకోకండి. నాదగ్గరేమీ కొనడుఆయన. ఆయన తెగులుకుదరాలి.

నర—రెండు పనులయినాయి. ఇంకమూడో Item resolutions

రాజా—ముందుకొత్త appointment కానియ్యండి. పాపం చాలామంది వచ్చి ఎండలో నిల్చున్నారు.

కరణం—నిలోన్సనివ్వండి. ఎవరికోసం.

రాజా—నరేమీయిష్టం. నాకుసెలవు. పనియున్నది. (పోవుచూ) Directorకెద్ద అర్జీయిచ్చి recognition లాగించేస్తాను. (పోవును)

నర—అమ్మయ్యా! ఇంకబ్రతికాము. అడ్డుండదు. ఇదిగో వినండి గబగబా resolutions అన్నీచదివేస్తాను. మీకిష్టం లేని దానికిమాత్రం చేతులెత్తండి. మొదటిది పిల్లలుండకూడదన్నది. మీకు తెలిసిందేకదా?

ప్రతిపాదకుడు-రంగరావుగారు.

Seconder ఎవరు?

కాపు—అంతాను ఎవ రేమిటి?

నర—అట్లాకాదు ఎవరోఒకరు సెకండుచెయ్యాలండి.

కాపు—అయితే నా పేరేసుకో

నర—ఇది ఇష్టమైనవాళ్ళందరూ చేతులెత్తండి.

అయ్యార్—నూందు యిష్టంలేకపోతే చేతులెత్తమన్నావు కాదట య్యా ఏగిఖాయం?

నర—వెనుక చెప్పినమాటఖాయం. ఎత్తండి.

(అందురు ఎత్తుదురు. ఎత్తి అట్లే ఉంచుదురు)

నర—ఊం దింపండి. (దింపుదురు)

విస్సయ్య—ఎత్తండోయ్ దింపండోయ్ మాయబొమ్మలంట (పాడును)

(అందరునవ్వి భేష్ భేష్ అందురు)

కాపు—అంతాపాడుశాస్త్రుల్లా యిందారి.

కరణం—పనికానివ్వండోయ్. వెధవవేళాకోళాల్లోకి దిగినారేమిటి?

కాపు—ఓయిబాబు కరణంగార్కి కోపంవచ్చింది మాట్లాడకూడదు.

నర—రెండో resolution

సెలవులలో పిల్లలు ఆటలాడి పాడయిపోతున్నారు గనుకను న్నూ మాస్టర్లకిచ్చేజీతమునకు తగినంతప్రతిఫలం మనపిల్లలకి ముట్టడంలేదు గనుకనున్నూ ఇక్కడనుంచి ప్రతిశనివారం Working day క్రిందఏర్పాటు చేయుడమైనది.

Proposer కరణంగారు Seconder ఎవరుంటారు.

కాపు—ఇందాకా చెప్ప లేదుటయ్యా నేనుంటానని.

(నర—అదివేరండీ. ఆresolution కాదది.)

కాపు—అన్నిటికీ నేనే.

నర—సరే. అందరికీ అంగీకారమేనా.

కాపు—ఇంకాలకులుకు తారేమిటయ్యా. చావగొట్టి మాస్టర్ల చేత పని పుచ్చుకుంటూవుంటే ఎవడువద్దంటాడు.

(అందరు చేతులెత్తి దింపుదురు)

నర—3 resolution

మొన్నజరిగిన స్కూలుఫయినల్ పరీక్షలో ఇక్కడ results Nil గనుక మాస్టర్లకందరికీ సెలవులలో జీతం కోసివేయడమైనది.

Proposer myself. Seconder కూడా myself ఎవరూ లేకపోతే.

కాపు—లేకపోవడమేమిటి అన్నిటికీ నన్నేసుకోమన్నానుగా. మహామంచి resolution తెచ్చినావయ్యా, పంతులూ opening dayకి మాష్టర్లజీతాల బెంగలేదింక మనకి. ఒక్కొక్కడు రెండేసి చేతులెత్తండోయ్. ఈసెక్రిటరీగార్ని మనము శాశ్వతముగా ఎన్నుకోవడమైనది. దానికూడా చేతులెత్తండి.

అందరు—సందేహమేమి. (ఎత్తుదురు)

నర—ఇటువంటిగౌరవము నాకుకలుగజేసినందుకు మీకందరికి నేను కృతజ్ఞుణ్ణి.

విస్స—కృతజ్ఞుణ్ణి అనండి కృతాఘ్నుణ్ణేమిటి?

నర—అదేనయ్యా సుహాతప్పుపట్టినావు. ఇచ్చావేమీ తద్దినాలు లేవు? తీరుబడిగా కూర్చున్నావు.

విస్స—ఇప్పుడందరూ శ్రాద్ధాలు మానేస్తున్నారండి కర్మం. ఏమి గిట్టడంలేదు. మనస్కూల్లో తెలుగుమాష్టరుగా నన్నుంచుకోండి. మీయిష్టం వచ్చినంతఇవ్వచ్చు.

నర—అదీ, ఇదీ ఎట్లాచూచుకుంటావయ్యా.

విస్స—ఏదోతంటాలు పడతానులెండి. కమిటీమెంబర్నిగాదూ నాయిష్టంవచ్చినప్పుడు వెళుతూఉంటాను. Headmaster నోరెత్తడానికి వీలులేదు.

నర—ఆసంగతి తరువాత మాట్లాడుదాంలెండి.

resolution No. 4 వినండి.

భాగ్యవంతుల పిల్లలకి చదువుమీద సాధారణముగా ఇష్టముండదు గనుకనున్నూ, బీదవారు ముష్టిఅయినా యెత్తి పిల్లలకు చదువు చెప్పించుకొందురు గనుకనున్నూ పైవాళ్ళకి encouragment కొరకు ఇక్కడనుంచి Scholarshipలన్నీ భాగ్యవంతులకే యిచ్చుటకు నిశ్చయపరచడమైనది.

కాపు—ఇదేమి resolutionఅయ్యా, రేపటినుంచి ప్రతివాడూ భాగ్యవంతుడనే అంటాడు.

నర—అట్లాఅననీయవలెననే నోయ్. Resolutionయొక్క ఉద్దేశ్యం కనిపెట్టలేవేమి. అప్పుడు అందరూ భాగ్యవంతులేగనుక

మేము యెవరికీయివ్వం అనవచ్చు.

కాపు—ఓష్, అదా కానివ్వండి ఎత్తండోయ్ చేతులు. ఇంకా చూస్తారేమిటి. ఒకదానికన్న ఒకటి బాగున్నాయయ్యా, పంతులు. మనము ఒక్కళ్ళకీ యియ్యక్కర్లేదన్న మాట యిక్కర్లేదంచి.

రంగా—proposer పేరు Seconder పేరు చదవలేదండి.

కాపు—ప్రతిదానికి చదవాలయ్యా, అన్నిటికీ ఆయనా నేనేఅనుకోండి. పంతులూ, అన్నిచదవేసెయ్యి. చేతులెత్తలేక దంపలేక నస్తాడచ్చిస్తున్నారు అన్నిటికీ కలిపెత్తుతాను.

నర—అయితేవినండి.

No. 5. మాష్టర్లందరూ రాత్రిళ్ళు ఒకగంట Committee memberల యింటికివచ్చి వారిపిల్లలకి private చెప్పవలసి వుంటుంది.

అందరు—బాగుంది. బాగుంది.

నర—ప్రస్తుతం ఇవ్వేనండి.

అందరు—సరే వీటికన్నిటికీ మాకంగీకారమే (చేతు లెత్తుతారు).

నర—ఇక మనము క్రొత్త Teacher ని appoint చేయవలసివుందండి

రంగా—సరే ఒక్కొక్కర్ని పిలవండి కనుక్కుందాం. ఎంతండి ఆ పోస్టుకి Salary

మూ—50 రూ. L. T. Pass అయినవాడు కావాలి

కాపు—మనముక్రొత్తగా appoint చెయ్యడమెందుకు? ఈ యేడు ఉన్న వాళ్ళతో కాలక్షేపం చెయ్యమనండి.

నర—అల్లా కాదు. Headmasterని ఒకణ్ణి వేసుకోవాలి. క్రొత్తది మానివేసినాములెండి.

రంగా—ఎంతమంది వచ్చినారు ఆ Postకి

నర—50 మంది

కాపు—అయితే ధరయింకా తగ్గించండి.

నర—ఇంకతగ్గిస్తే Inspectorవప్పుకోడులెండి. 50రూ minimum

కాపు—అదొకటివచ్చిండీ. సరే కానివ్వండి.

నర—50 మందిలో మనమిప్పుడు Select చేసుకోవాలి.

కాపు—ఒకణ్ణిపిలవండి ఠికంచూద్దాం.

నర—Philosophy M. A. గారిని పిలవరా.

(రమణరావు ప్రవేశం)

నర—ఏమండీ రమణరావుగారూ, కమిటీయెదుట చెప్పుకోండి మీ సంగతులన్నీని.

రమ—చెప్పుకోడాని కేమున్నదండి. M. A. ని కదాండి.

కాపు—ఎంతికివస్తావు?

రమ—M. A. కి నూరురూపాయలు నిసబండి. 80 తక్కువైతేరానండి.

కాపు—వచ్చేమాట చెప్పవయ్యా బేరముచెప్పక.

రమ—మీయిష్టం. మీరెంతిస్తారో చెప్పండిముందు

కాపు—30 కం యెక్కువియ్యం.

రమ—30కి యెవ్వడొనావస్తే నేనూరికే పనిచేస్తానండి.

కాపు—ఆమాటలన్నీ మాదగ్గిర తీసేద్దురూ.

రమ—నేనుB. A. కాదండి pass అవుత. M. A. కూడాఅయినాను.

కాపు—అందుచేత ఇంకో 10 వేసుకోండి. ఏదోఖాయంచేసుకోండి ఎందుకు పోగొట్టుకుంటారు బేరం. చాలామందివచ్చారు చూశారా.

రమ—ఇంకో పదితగ్గిస్తాను కావలిస్తే. అంతకితగ్గను.

కాపు—తగ్గకపోతే వెళ్ళండి. మాకుమనిషేదొరకడా యేమిటి.

రమ—60 కి యేమైనా అడ్డముంటుందా? వెళ్ళవచ్చునా?

కాపు—50 కి దమ్మిడీ యెక్కువియ్యం. ఊరికే బేరంచేస్తుంటే ఇంకాతగ్గిస్తాం.

రమ—పోనీ ఇంకోఅయిదేసుకోండి. 55 అవుతుంది.

కాపు—దమ్మిడి యెక్కువఇయ్యం. మీయిష్టమైతే ఒప్పుకోండి. లేకపోతే పోండి విసిగించక

రమ—సరేలెండి తీరాయింతదూరమువచ్చాక ఊరికేపోవడం నాకిష్టంలేదు. ఆర్డరుపయచేస్తారా?

కాపు—ఉండండి అప్పుడేఅయిందా. అందర్నీ అడగొద్దూ? ఇంకా ఎవరైనా తక్కువకిపనిస్తే? మీరక్కడ కూర్చోండి. ఇంకోణ్ణి పిలవరా?

నర—జోగారావుగార్ని పిలు (జోగారావు వచ్చును.)

కాపు—మీరేమి pass అయినారండీ?

జోగ—L. T. అయినానండి

కాపు—ఎంతికివస్తారు?

జోగా—ఇప్పుడేమీచెప్పనండి. నెల్లాళ్లు నాటీచింగుచూచుకోండి. దాన్నిబట్టి మీరేనిర్ణయించండి.

కాపు—పనికేమిటిలెండి. ప్రతివాడూచేస్తాడు. గుడ్డిముండచెప్తుందపాఠాలు. చావకొట్టి పనిచేయిస్తాము. నువ్వేం మొనగాడివేంటి?

జోగా—నాకుమంచిమంచి సర్టిఫికేట్లున్నాయండి.

రమ—నాకూఉన్నాయండి. కావలిస్తే చూపిస్తాను.

కాపు—మీరూరుకోండి. అడిగినప్పుడు చెప్తూఉండండి గొడవచేయక.

జోగా—(రమణరావుతో) మీరు L. T. కానిదే మీకెట్లాహక్కుం దండీ చెప్పడానికి. (పీరయ్యతో) Inspector objection చేస్తాడండి పీళ్ళను వేసుకొంటే.

కాపు—హక్కు అంటున్నావు, అదేమిటయ్యోయ్.

జోగా—బండివాణ్ణి బిళ్ళలేందే తోలనిస్తారాండీ? అట్లాగేమాకుకూడా. ఇంకా యెవరినైనా అడిగి తెలిసికోండి.

కాపు—(జోగారావుతో) మరినీకేదిబిళ్ళ?

జోగా—నాకు L. T. సర్టిఫికేటండి బిళ్ళ.

కాపు—(రమణరావుతో) సీకుండిటయ్యా ఆబిళ్ల

రమ—నాకక్కరలేదండి అది. నేను M. A. pass అయినాను అంతకంటె ఎక్కువది. బిళ్లలేనివాను బండితోలేడండీ?

కాపు—ఓ, సార్వీసు ఉంటేసరి.

జోగా—పోలీసువాడు పట్టుకుంటే తెలుస్తుంది ఆబాగు. తెలియనివాళ్లదగ్గిర డాబుచెయ్యకోయ్. M. A. అయితే ఇక్కడెవడికినొప్ప?

రమ—L T. అయితే నీగొప్పఏమిటి?

కాపు—బాబూ! మీరిద్దరూ అవతలకివెళ్లి తిట్టుకోండి. ఏమిటయ్యా ఈఅల్లరి సెక్రిటరీగారు.

నర—కూర్చోండి జోగారావుగారూ మీరు Salary సంగతి తేల్చినారుకారు.

కాపు—ముందు L. T.ట అదేదో తేల్చండి. అదికావాలా? అక్కర్లేదా?

నర—teacherకి అదిఉంటే licence అన్నమాటండి. మనకి grant కూడా ఎక్కువిస్తారు గవర్నమెంటువారు.

కాపు—అల్లాగా! అయితే మొదటఅతన్ని లేచిపొమ్మనండి తక్షణం. ఎందుకాలశ్యం? పోవయ్యానీవు. L. T. కాండే ఎందుకు వచ్చావు?

రమ—ఛీ! ఇక్కడ పనిచెయ్యడంకంట్లె ముష్టెత్తుకుంటే నయం.

కాపు—ఇక్కడ ముష్టెత్తితే. ఇన్నిగింజలుకూడా దొరకవు.

(రమణరావు పోవును)

మీ రెంతికివస్తారండీ?

జోగా—జీతంచెప్పమన్నారా? సిసలు చెప్పమన్నారా?

కాపు—సిసలే చెప్పు నూకేమిపనిలేదా యేమిటి?

జోగా—80

కాపు—ఓరిబాబు. నలుగుర్నే యచ్చు నీలాంటివాళ్ళని. ఇంక అడగక్కర్లేదూ?

జోగా—అంతకెవడయినా తక్కువకివస్తే నన్ను పిలవండి

కాపు—అప్పుడు నిన్ను పిలవడం యెందుకు. అక్కడేవేసుకుంటాం. నువ్వేం నెత్తిమీద రాయిపెట్టినావా?

జోగా—సరే 60కి తక్కువకిరాను మీయిష్టం.

కాపు—(నవ్వుచూ) బేరంచేయుచున్నావు బామ్మడా!

జోగా—మీ రెంతిస్తారు చెప్పండి.

కాపు—నలభయి యిస్తాము. ఇష్టమయితేఉండు లేకపోతే పో

జోగా—సరే 50 ఇస్తారా? అదీఇవ్వరా?

వర—సరే కూర్చోండి అక్కడ.

ఓరీ వెంకన్నగార్ని పిలవరా (వెంకన్నవచ్చును.)

వర—ఏమండీ వెంకన్నగారు బేరాలతోపనిలేదు. మాకు పొద్దు పోతోంది. అదిగో ఆయన 50కి వస్తానంటున్నాడు. అందుకు సిద్ధమయితే ఉండండి లేకపోతే వెళ్ళండి.

వెం—ఏమిరా! నీవు 50కే వస్తానన్నావా?

నర—నిజమేనయ్యా. నన్నునన్నావా యేమిటి

వెంక—వాడుఅల్లావచ్చేవాడు కాడండి. వాడువస్తే నేనూవస్తాను.

నర—సరేకూర్చోండి అక్కడ. ఒరే, శ్రీనివాసరావుగార్నిపిలు

(శ్రీనివాసరావువచ్చును)

ఏమండీ నిన్నకనుపించినవారుకాదూ?

శ్రీని—అవునండి బంకి.........

నర—అవును లేవయ్యా జ్ఞాపకముందినాకు. 50కి వస్తావా తెగనీల్గు తావా?

శ్రీ—వాళ్ళెంతకొస్తానన్నారండీ?

నర—వాళ్ళసంగతి నీకెందుకు? వాళ్ళగోవ తేమిటినీకు. L. T, పోయినవాడవు కూడను.

శ్రీ—వాళ్ళకీ నాకు 5 రూ. తేడాలోఉంచండి.

కాపు—అయితే 45కే వస్తావన్నమాట. (మిగిలిన ఇద్దరతో) మీరిద్దరూ వెళ్ళిపొండి.

జో-వెం—మేము 40కే వస్తామండి. అదేమన్నమాట.

నర—సరే దెబ్బలాడుకోకండి. 40కి Settle చేసినాము. అక్కడ కూర్చోండి అందరూ. (కూర్చుందురు)

ఒరే......

కాపు—ఇంకచాలెండి సెక్రటరిగారు! పొద్దుపోతూఉంది. మిగతా వాళ్లని పొమ్మనండి. ఈముగ్గురిలో Select చేసుకుందాం.

నర—ఒరే నీవుపోయి మిగతా L. T.లని వెళ్ళిపొమ్మన్నారనిచెప్పు.

నౌకరు—చిత్తం. (పోవును)

నర—ఏమండీ, ఇప్పుడుమీతో కొన్నిసంగతులు చెప్పవలసిఉన్నది.

ఇప్పుడు మీముగ్గురిని సెలక్టుచేసినాము. వెనుక appoint చేసిన మాస్టర్లతో చాలాకష్టపడ్డాం. ఒకడు 6 నెలలు ఒకడు 3 నెలలు ఉండివెళ్ళిపోతూఉండడం. అయితే డబ్బుమాకేమిగిలింది. వాళ్ళజీతాలు ముట్టకుండా పోయారు వెధవలు. పైగా ఒకడికి Commonsense లేకపోవడం. పిల్లలనికొడితే అదేకొట్టడం. మీదెక్కించుకుంటే అదే ఎక్కించుకోవడం. అందుచేత ఇప్పుడు మేమేర్పరచినదేమిటంటే చిన్న test paper ఒకటి Commonsense మీదయిస్తాం. అదిమీరు answer చెయ్యాలి. తరువాత practical test వేరేఉంది. ముందు నెల మీరుముగ్గురు కలిసిపనిచెయ్యాలి ఊరికే. ఆ నెలరోజులు మేము మీ movements అన్నీ Study చేస్తూ ఉండి impressions తీసుకుంటూఉంటాం. నెల అయిన తరువాత ఎవరినో ఒకణ్ణి ఉంచుకొని మిగతవాళ్ళని పంపించేస్తాం. ఆ Select కాబడ్డవాడు మాకమిటీ resolutions అన్నిటికీ bind అవుతున్నట్టుగా సంతకం చేయడమేకాకుండా 5 ఏళ్లు ఉంటామని bond వ్రాసియివ్వాలి. ఇందుకు వప్పుకుంటే ఇదుగో question paper,

ముగ్గురు—చిత్తం దయచేయండి.

నర—(paper ఇచ్చును) చదువుతాను విని సందేహాలుంటే అడగండి. (చదువును)



## Theory paper on commonsense.

# ప్రపంచ జ్ఞానము.



[N. B. ఈక్రింది అయిదుప్రశ్నలలో తోచినవానికి జవాబిచ్చి మిగిలినవానికి మానివేయవలెను. Time 1 గంట అయినను చేతిలోనుండి పేపర్లులాగేవరకు వ్రాస్తూనేఉండవచ్చును. పరీక్షనున్నవారితో గుసగుసలేకాని, గట్టిగా మాట్లాడకూడదు. పరీక్షాధికారులు చూడకుండా ఎంతయినా కాపీచేసుకొనవచ్చును. కాపీచేసుకుంటున్న వాళ్లుతప్ప మిగతా వాళ్లు వాళ్లెక్కన్ని నిందించుకుంటూ కిక్కురుమనకుండ నుండవలెను. పరీక్షాధికారులు ఒకప్రక్కనికూర్చొని Paper చూసుకొనేటట్లు గట్టిగా ఏర్పాటు జేయవలసినది. ]

1. ఒకటీచరు 15 నిముషములు ఆలశ్యముగా క్లాసులోనికి పోవును. 15 నిముషములు ముందుగా పాఠమును మానివేయును. 20 నిముషములు లోకాభిరామాయణము జెప్పును. Periods 45 నిమిషములు చొ॥ ఆయన పనిచేసేది రోజుకు 3 periods అయితే, నెలకు శెలవు రోజులుపోను ఆయన actualగా చేసేపనియెంత?

2. ఇద్దరు టీచర్లున్నారు. ఒకఆయన వారమునకు అయిదు రోజులు చొ॥ December నాటికే course పూర్తిచేసుకొని తరువాత revision ప్రారంభిస్తాడు. రెండవఆయన వారమునకు ఆరు, లేక యేడురోజుల చొ॥ పనిచేయుచున్నను March ఆఖరునాటికికూడ course కాకనేయుండును. పైయిద్దరిలో యెవరుగట్టివారని మీయభిప్రాయము? పై యధికారుల యభిప్రాయము?

3. 200 రూపాయలు 20 టీచర్లు హెచ్చుతగ్గులుగా పంచుకోవలసి వచ్చినపుడు ఏమేమి తగాదాలు అందులో crop up అగు

ను? ఎన్ని adjournmentలతో మీటింగు పూర్తిఅవుతుంది?

4. మామూలు రోజుల్లోకంటె స్కూలు Inspection సమయములో మాస్టర్ల చురుకుదనము శ్రద్ధ ఖంగారున్నూ క్లాసులలో పిల్లల అల్లరిన్ని ఏ ratioలో ఉండును?

5. (a) సాధారణముగా Scholarship కి వచ్చే applicationలకు చేర్చబడే Poverty certificate లలో నూటికి నిజమైన వెన్ని వుండును? దగావి యెన్నివుండును? ఈ రెండింటి భేదము తెలిసికొనుటకు private enquiry తప్ప వేరే గతియున్నదా?

(b) Tennis matches గానియితర Matches గాని critical అవస్థలో నున్నప్పుడు సాధారణముగా referees కి అకస్మాత్తుగా కళ్ళు మూతలుపడుటకు బలవత్తరమైన కారణమేమి?

(వాళ్ళు వ్రాయుచుండగా ఒకడు తటాలునవచ్చి)

ఒకడు—అయ్యా school building అంటుకుంటుంది. అంతా నాశనం అయిపోయింది గావాలి రావాలి.

నరి—అరే విశ్వమ్మకడుపుకాల L F తే చేసిఉంటాడు. పదండి చూద్దాం. (అందరు పోదురు)

(తెరపడును)



# పల్లెటూరి పాఠశాల.

ఏడవరంగము.

[ప్రదేశం స్కూలులో Teachers' Private room.]

(ప్రవేశం ఇద్దరు మాష్టర్లుండగా సుబ్బిశెట్టి ప్రవేశించును.)

సుబ్బి—ఊరికే కూర్చున్నారేమయ్యా, పనిలేదూ? class ఎగదొబ్బినారా యేమిటి? అదేమిటా కాగితం? వేరుశనగకాయలా? ఆరి. ఇదా మీ పని బాబు. ఆపేపర్లేమిటక్కడ?

*T* (i)—ఆపేపర్లు మాస్వంతమేనండి. ఇది మా Private room. మీరిక్కడకి రావడానికి rule లేదండి. వచ్చినా criticise చెయ్యకూడదు. ఇక్కడ మాయిష్టం. ఆడుకుంటాం. పడుకుంటాం. ఇది మా leisure Period. working period ఎగదొబ్బితే అప్పుడడగండి.

సుబ్బి—లీజరుపీరీడనగా.?

*T* (i)—అనగా పనిలేని సమయమన్నమాట. ఎప్పుడూ పనిచేస్తూఉంటే అలసిపోతామండి. అందుచేత మధ్య మధ్య కూర్చోడానికి అవకాశమిస్తుంటారు.

సుబ్బి—అలసిపోతారా! పొద్దున్నుంచి రాత్రిదాకా కొట్టులోనే కూకుంటాను. నాకేఅలసటఉండదేం. మహా మంచి Head-master దొరికాడుమాకు. ఇదా ఆయన మీచేతచేయిస్తూ ఉన్నపని. (ఇంకొకనితో) మీకూ లీజరేంటయ్యా?

*T* (ii)—అవునండి.

సుబ్బి—అందుచేతనా బాబూ, సెనక్కాయలు తింటూకూకున్నారు? ఏవీ తెంపుగింజలు. (చూచి) ఎక్కడకొన్నారయ్యా ఇవి. మాకొట్లో నుంచివిడున్నాయే.

T (ii)—రేపటినుంచి అక్కడే కొంటాంలెండి.

సుబ్బి—అయితేగాని లీజకులో కూకోడంకాదు. మాచిత్రాబుక్కులంపుతాను. ఆవజ్ఞా వేసిపెట్టండి.

T (ii)—అది మాపనికాదు.

సుబ్బి—ఏమయ్యోయ్, నీవిట్లాఎదిరించావంటే ఉద్యోగానికి నీళ్లొదులుకోవలసిందే. చచ్చినట్టు ఏమిపనిచెప్పినా చేస్తూనే ఉండండి.

T (i)—మీరూరుకోండి. సరేపంపండి. వేసిపెడతాం.

సుబ్బి—అల్లాదారికిరా. (ముందుకువచ్చును. తెరపడును.) (తనలో) వెధవలు యెల్లాహడిలిపోతారో. మేమురావడంతోనే. లీజకుపీఠయద్దు నాకులాభానికే. దమ్మిడీ ఖర్చులేకుండా పుస్తకాలన్నీ వాయించుకుంటాను.

(ఒక ముసలమ్మ ప్రవేశించి.)

ముస—ఏం సుబ్బిశెట్టి, నువ్వుండేనా ఇంతపనిచేయిస్తా?

సుబ్బి—ఏమిటమ్మా! అది.

ముస—నీకు తెల్దూ. ఏడీ ఆహెడ్డుమాస్టరంట. ఆసిఱిమ్మండ. చితకకొట్టేసాడు మావాడిని జరంవచ్చిందాడికి తొంగున్నాడు. అట్టానేంటయ్యా కొట్టడం. ఏడదూ?

సుబ్బి—కొట్టితే జ్వరంవస్తుందిటమ్మా. ఆమాత్రం భయంవస్తూ పిల్లలకి. కొట్టమనీ మీరేఅంటారు. కొట్టితే ఇల్లాఏడుస్తారు.

ముస—కొట్టకుంటె చచ్చేటట్టు కొట్టిస్తావుటోయ్ నీజిమ్మడ.

సుబ్బి—ఏదో కొంచెము ఎక్కువ తగిలిందేమో లే. నేను మందలిస్తాను నువ్వెళ్లు.

ముస—రేపటినుంచి వాడిని ఇక్కడికి పంపను. మీ బడి మండినట్టే ఉంది. ఆ సొడ్డుమాస్టరికి పిల్లలు లేరు కామోసు అణ్ణితగలయ్య.

సుబ్బి—పో. పో. ఇక్కడ తిట్టక. నేను మందలిస్తానన్నానుగా.

(ముసలమ్మ పోవును)

క్లాసులోకి వెళ్ళి చూద్దాం ఏం జేస్తా ఉంటారో.

(పోవును. తెర తీయబడును.)

(ప్రవేశం—క్లాసు. 10మంది పిల్లలు. 1 టీచరు. బల్లపై సైన్సుసామాను అమర్చబడియుండును)

Teacher—వెధవల్లార. అల్లరిచేయకుండోయ్ సెక్రటరీకూడా వచ్చారు బళ్ళోకి.

boy 1—సుబ్బిశెట్టికూడా వచ్చాడండీ.

T—శెట్టిగారను వెధవా.

boy—నేనను.

T—అనకపోతే బెంచీఎక్కు.

boy—నేనెక్కను.

T—ఎక్కకపోతే అవతలకి వెళ్లు.

boy—నేను వెళ్ళను.

T.—ఓరి వెధవా నిన్ను నాలుగేళ్ళు fail చేస్తానుండు,

boy.—నేనిక్కడుంటేకాదు నాలుగేళ్లు.

T.—అయితే ఈయేడు తప్పకుండా fail అవుతావు.

boy 1—నాకు మార్కులువస్తే ఎట్లా fail అవుతానో చూస్తాను.

T.—వెధవా నీకు మార్కులు ఎట్లావస్తాయో చూస్తాను. ఈయే

డు నున్న నీచదువంతాను. ఎంతవ్రాసినా ఒక్కమార్కివ్వ
నుండు. సిఫారసుస్తాను.

boy 1.—నన్ను failచేసి ఈఊళ్లోఉండగలవానువ్వు. గోడలమీద
చూచుకో.

boy 2.—మేస్టారూ, ఈ మగిలు తాడున్నాడండీ

T.—వెధవా! మళ్లాగిల్లవోయ్. నాతోచెప్పడం ఎందుకు?

(సుబ్బిశెట్టి ప్రవేశించి)

ఏమిటండీ గోలగాఉంది ఇక్కడ.

T.—వాడుసుబ్బిశెట్టిగారూ అనమంటే అండటండి.

సుబ్బి—వెధవని fail చెయ్యండి ఈయేడు. వాడింట్లోకూడా పోగ
రేసిపోయాడట. అయితే 10 మందే ఉన్నారేం క్లాసులో.

T.—ఆఖరు period ఎవరూఉండరండి.

సుబ్బి—ఆఖరు period విధిగలుపు వేయించండి.

T.—గోడలుదూకి పోతారండి వెధవలు ఉండరు, వాళ్ళకి absent
వేస్తానులెండి.

సుబ్బి—Absent ఏమిటి fine వెయ్యండి వెధవలకి ఒక్కొక్కరూపా
యి చొ॥ తెగులు కుదురుతుంది. ఇంకెప్పుడూపోరు. ఎవ
రెవరు పేర్లుచెప్పండి. ఎంతమందోను.

T.—చిత్తగించండి. మీవాడొకడు...

సుబ్బి—ఆఁ. ఏక్లాసిది? II form ఏమిటయ్యా? ఆమాటముందుచె
ప్పినారుకారేమి? ఇవ్వాళకి క్షమించండి పాపం. రేపటినుం
చి fineతప్పకుండా వేద్దురుగాని. ఏది ఆగిన్నెలలో ఏమి
చేస్తారో చెయ్యండి చూద్దాం.

(Teacher Experiment చేస్తుంటే చేయివణకి test tube

క్రిందపడి పగిలిపోవును.)

సుబ్బి—ఆర్నీ యిల్లు బంగారంగాను. బద్దలుకొట్టినావు. చెయ్యి వణకుతూ ఉందేమిటయ్యా, సార్వీసు లేదా యేమిటినీకు?

T.—ఇదియెప్పుడూ పోతూనేఉంటాయండి.

సుబ్బి—ఎప్పుడూపోతూఉంటే గాజువికాని తగలేయడం యెందుకు. రాగివో, ఇత్తడివోకాని యేడవాలిగాని

T.—(నవ్వును)Head masterతో చెప్పండి. మాకు తెలయదానాడన

సుబ్బి—పైగా బద్దలుకొట్టి నవ్వుతావేమిటయ్యా, Head masterతో చెప్పుతానుండు.

(ముందుకు రాగా తెరపడును)

(ఒకవిద్యార్థి ప్రవేశించును.)

సుబ్బి—ఏక్లాసురా అబ్బాయినీది?

వి.—V form.

సుబ్బి—ఎక్కడికి వెళుతూఉన్నావు.? ఆసంచి యేమిటి?

వి.—మాస్టారు సంతలో కూరలు కొనిపెట్టమన్నారండి.

సుబ్బి—వెధవా! బడివదలాక వెళ్లరాదూ? పాఠాలుపోవు?

వి—ఇప్పుడు వెళ్ళకపోతే లేతవిదొరకవుటండి. మార్కులేస్తాను వెళ్ళమన్నారు?

సుబ్బి—నౌకరిని పెట్టుకోమనరాదూ. సరే యీరోజుకి వెళ్ళిరా.

(విద్యార్థిపోవును.)

సుబ్బి—హెడ్డుమాస్టరు గదిలోనికిపోతాను. (పోవును)

(తెరతీయబడును)

(Head master గది. సెక్రెటరీ Head master ఉందురు.)

నర—ఏమండీ మాస్టర్లు సరిగా పనిచేస్తున్నారా?

H M.—చెయ్యకపోతే ఊరుకుంటానా? నిరటి సంవత్సరం Short-

term తాలూకు జీతాలకోసం చాలామందర పెడుతూ ఉన్నారండి. దుకాణందార్లు అరువు ఇవ్వడం లేదుటండి.

నర—ఇవ్వకపోతే మేమేమిచేస్తాం. పూటకిగతిలేనివాళ్లకి Master పనిఏమిటండి? నేనెప్పుడు School చూద్దామనివచ్చినా జీతాలగొడవే యెత్తుతుంటారు మీరు.

H M.—చిత్తం. వారిమాట నేను మనవిచేస్తున్నానండి.

నర—మీరుచెప్పినమాట చెప్పకుండా సర్దిచెపుతూ ఉండండి.

H M.—అక్కడికి అనేకవిధాల చెపుతూఉన్నానండి. పాపం ఇంట్లో గింజలుంటే ఇంత ఇబ్బందివుండదు.

నర—నెల 1-కి పదేసిరూపాయలు తగ్గించుకుంటారేమో కనుక్కోండి. ఆనక bankలోనుంచి తీసుకువచ్చి పారేస్తాను.

H M.—ఎంతఇచ్చినా పుచ్చుకుంటారండి పాపం. రూపాయికంటికి కనబడితే చాలునని ఉన్నారు.

నర—అయితే అణాబిళ్ళలు తెప్పించి సంతకాలు నాల్గు నెలలకి పెట్టించి ఉంచండి.

H M.—May, June లదో?

నర—అది కోసేసాంకాదండి. Resolution చదివి వినిపించలేదాయేమిటిమీరు?

H M.—చిత్తం. అవును. జ్ఞాపకం ఉందండి.

నర—సంతకాలుమాత్రం సరిగ్గా పూర్తిమొత్తానికి పెట్టించి ఉండండి.

H M.—చిత్తం. ఇవ్వాళ పండగండి వాళ్ళకి. గంటయింది కొట్టించమన్నారా?

నర—15 నిమిషాలు ఆగండి. ఒకసారి క్లాసులు చూచివస్తాను.

(ఒక పిల్లవాడు వచ్చును.)

ఎందుకు వచ్చినావు అబ్బాయినీవు?

పిల్ల—Master గారు time చూచిరమ్మన్నారండి.

నర—ఘంట కొట్టిందాకా పాఠం చెపుతూ ఉండమన్నారని చెప్పు.
ఎవరామాస్టరు పేరుచెప్పు.

పిల్ల—కొత్తగావచ్చిన జోగారావుగారండి.

(పిల్లవాడుపోవును)

నర—అయితే Masterగారూ. కొత్తవాళ్ళ ముగ్గురులోనూ మీ Confidential opinion ఏమిటి?

H M.—పాఠములు చెప్పటలోనూ, duty చెయ్యడంలోనూ వెంకటాద్రిగారు. obedienceలోమటుకు శ్రీనివాసరావుగారే నండి.

నర—మూడో ఆయన?

H M.—మూడోఆయన జోగారావుగారండి. క్లాసులో ఎప్పుడూ నిద్రపోతూ ఉంటాడండి ఆయన. పొరపాటున పిల్లలు లేపితే మీదపడి కరుస్తాడండి.

నర—ఇంకా?

H M.—Class books ఇక్కడ Teachers కొనుక్కోవడమేగాని, స్కూలు Supply చేయడంటే ఎక్కడాలేదీపద్ధతి. మీరివ్వకపోతే పాఠంచెప్పడం మానేస్తానంటాడండి. నేనుclass లోకి వెళితే నిలుచోన్నైనా నిలుచోడండి. ఇంకెట్లాగండి వేగడం ఆయనతో.

నర—సరే రకం తెలిసింది. ఈరోజుతో trial period అఖరేకాదు రేపటినుంచి రావద్దనండి ఆయన్ని. శ్రీనివాసరావుగారి చదువుచెప్పడం మీకునచ్చిందా?

H M.—చదువుకేమి కాదండి. నాకేమరుచెప్పడండి. నోటినుంచి ఉప్పూ పత్రి లేదండి. కానిపిల్లలకి ఆయనంటే హడలండి.

నర—అయితే ఆయన్నే ఉంచుకుందాం. రేపటినుంచి ఆయన్ని క్లాస్లోరానివ్వండి. చూడండి మీ Internal managementలో నేను జోక్యంకలుగ జేసుకోకూడదు కాని broad principles నాలుగు చెపుతాను. అవిమాత్రం జ్ఞాపకంపెట్టుకోండి.

H M.—చిత్తం. తమరు చెప్తే వినకపోవడంకూడా నాండీ. ఉండండి వ్రాసుకుంటాను.

నర—తరువాత వ్రాసుకోవచ్చు. ముందు వినండి. అసలు ఈ Teaching అనేది కులా monotonousలెండి. నేను చెయ్యక పోయినా Imagine చెయ్యగలను

H M.—చిత్తం.

నర—అందుచేత Monotony సాధ్యమైనంతవరకు relieve చేస్తూ ఉండడానికి time-table నెలనెలకీ మార్చేస్తూఉండండి. దానితోటి మాస్టరికి ఎప్పటికప్పుడు classలూ, subjectలూ కూడా క్రొత్తలవుతూఉండాలి.

H M.—చిత్తం బహుబాగాఉందండి. తమరు Theory of Education మీద ఒకపెద్ద book వ్రాయవలసినవారు.

నర—ఏదండి నాకుతీరుబడి. లోకవ్యవహారం ఎంతఉందినాకు? రెండవ Main principle ఏమిటంటే ఎక్కువ qualification' Service ఉన్నవాళ్ళకి తక్కువ classలు, తక్కువవాళ్ళకి ఎక్కువ classలు ఇస్తూఉండండి. పెద్దవాళ్లకంటె చిన్నవాళ్ళకి చెప్పడమే కష్టం.

H M.—చిత్తం.

నర—మూడవది ఎవళ్లయినా చచ్చిపోతూఉంటే తప్ప ఎవడికీ సెలవు ఇవ్వకన్గు. నాల్గవది. Extra work ఎప్పుడూ లోకువవాళ్లకే ఇవ్వండి. విసుగుకుంటూ అయినా వాళ్లే చేస్తారు. పెద్దవాళ్లు కబుర్లు చెప్పినంత చురుకుగా పనిచెయ్యరు.

H M.—ఇవన్నీ ఒక్కొక్కటి golden lettersతో print చేయవలసి ఉన్నది. మీకింత లోకానుభవము యెక్కడినుంచి వచ్చినదండీ?

నర—లేకపోతే యేమనుకున్నారు? ప్రపంచజ్ఞానం నాలుగూ observe చేస్తుంటే అదేవస్తుంది. బ్రహ్మాండమూ యేమిటి? ఏరోజు ఎంతెంత work turn out చేసింది ప్రతివాడిచేతనూ diary వ్రాయించండి. అది మీరు తణిఖీచేస్తూ ఉండండి. దీనితో క్లాసులో ఎవడూ నిద్రపోడు. కథలు చెప్పడు. Teachers' roomలో papers ఏవి వేయువద్దు. clerical workలోనె డుంటుంది. అది leisure లో చెయ్యండని మాష్టర్లకి వప్ప చెప్పండి. ఇంకా ఇటువంటివి అనేకమున్నాయి. మీరుబుద్ధిసూక్ష్మతచేత ఆలోచించి ఎప్పటికప్పుడు క్రొత్త rules చేస్తూ పాతవి break చేస్తే over lookచేస్తూ ఉంటూఉండాలి. masterలకి అందీఅందనట్టు ముట్టీముట్టనట్టు ఉండాలి. వాళ్ళతో sympatheticగా ఉన్నట్టు పైకికనబడి లోపల రహస్యంగా పని దొంగయెవడో కనిపెట్టుతూఉండాలి. మీకు confidence కుదిరితే అందులో ఒకణ్ణి మీకుprivate Secretaryగా చేసుకోండి. Drudgery work అయినా చూచి పెట్టుతూ ఉంటాడు.

(సుబ్బిశెట్టి ప్రవేశించును.)

H M.—(నిల్చుని) దయచెయ్యండి సెట్టిగారు.

సుబ్బి—ఏమిటయ్యా, గోడలన్నీ ఇట్లాఉన్నాయి బూజెక్కి.

H M.—whitewash వేయించాలనుకుంటున్నానండి.

సుబ్బి—సున్నం వేయించండి ప్రస్తుతం.

నర—whitewash అంటే అదేలెండి. మీరూరుకోండి.

సుబ్బి—తెలుగున యేడవరాదూ? దానికేంగాని స్కూలుడబ్బంతా తగలడి పోతూవుంది.

H M.—అ దేమండీ?

సుబ్బి—సైన్సుకి గాజుసామా నెందుకు చెప్పండి. క్రిందపడితే ఎందుకైనా పనికివస్తుందా వెధవగాజుపెంకు.

H M.—చిత్తం. ఆSubjectకి గాజుదేఉండాలండి. ప్రతిస్కూలులో జరిగే మర్యాదేనండి అది. ఇక్కడ కొత్తకాదు. ప్రమాదంచేత ఒకప్పుడు పోనూపోతుంది. దానికి మనం ఏంచేస్తామండి. మీడబ్బు పోగొట్టాలని ఉండదు కదాండి.

సుబ్బి—మాష్టర్లకి లీజరు పీరీడేమిటి? నిజమేనాఅది. సెనగకాయలు నములుతూ కూర్చున్నారు ఆగదిలో యిద్దరు.

H M.—అదీ ఉంటుందిలెండి.

నర—దానికి నేను ఏర్పాటుచేసినానులెండి. గుమాస్తా పుస్తకాలే వో వ్రాస్తూఉండాలని.

సుబ్బి—గుమాస్తాలకి పనిలెక్కలేదండీ. మనవుస్తకాలు పంపించి వ్రాయించుకుంటాం.

నర—సరే. యేదో చేయించుకోవచ్చు. ఊరికేకూర్చోపెట్టంలెండి. నేనొకసారి క్లాసులన్నీ చూచివస్తాను రండి HeadMaster గారూ, (వారందరూ ముందుసనువత్తురు. తెరపడిపోవును.)

నర—శెట్టిగారూ మీరువెళ్ళండి. పొద్దుపోయింది. Head-

masterగారూ, Contingency bill ఈనెలకి ఎంతయిందండి.

H M.—10 రూపాయిలండి.

నర—ఓయి బాబో. వెనకటి ఆయనే నయము. 5 రూ కన్న ఎక్కువ Sanction చెయ్యను. ఆపైనమీాయిష్టం. ఎందు కయిందో అంతచెప్పండి.

H M.—పీపకెత్తాలక్రింద అయింది నాల్గురూపాయలు.

నర—సరే. అది విధాయకమే. తరువాత?

H M.—Chalk pieces క్రింద నాలుగు.

నర—అంతెందుకయ్యా. Blackboard పనితగ్గించమనండి.

H M.—Blackboard పని అట్టే ఉండదండి. ముక్కలు మిగిలితే. జేబులో వేసుకుపోతారండి లాంతర్లు తుడుచుకోడానికి

నర—అట్లావల్లకాదని Notice వ్రాయండి. రోజుకి రెండుమూడు Notice లైనా వ్రాస్తున్నారా లేదా? మిగిలిన రెండురూపాయలెందుకు?

H M.—సిరాకండి.

నర—రెండురూపాయలు సిరాకే! తాగేస్తున్నారా యేమిటయ్యా?

H M.—వ్రాసేది తక్కువేనండి. క్రింద ఒలుకపోసేదెక్కువ. ఏమన్నా అంటే మాస్టర్లు మీాదపడి కరుస్తారు. పిల్లలకి సిరాపని ఉండనే ఉండదండి.

నర—కాగితాలు ముక్కలైనవి అక్కర్లేదా యేమిటి?

H M,—10 రూ. లకే మీారిల్లా అంటున్నారు. ఇంక అదీ మీాకెక్కడ పెట్టనండి. మేష్టర్లే కొనుక్కుంటారు. అసలు అట్టే Notes వ్రాయనేవ్రాయరు పాపం.

నర—వ్రాస్తే వాళ్లనే కొనుక్కోమనండి. పాపముంటారేమిటి? పదండి చూచివద్దాం. (పోదురు.)

# పల్లెటూరి పాఠశాల.



ఎనిమిదవ రంగము.

(Headmaster గారిగది. Headmaster, గుమాస్తా ఉండగా సెక్రటరీ ప్రవేశించును)

నర— Headmasterగారూ, ఆఖరు Period సెలవిచ్చేసి Teachers ని అందరినీ Meet అవమని నోటీసువ్రాయండి.

H M.—ఆఖరి period వాళ్ళని work చెయ్యనీకపోవడ మెందుకండీ. దండుగకాదు మనకీ. period పోతే మాష్టర్లందరి మీాద మొత్తం 5, 6 రూపాయలు దండుగండీమనకి.

నర—సరే గంటఅయినాకే రమ్మనండి.

H M.—(Notice వ్రాసిఇచ్చును. బంట్రోతు తీసుకుపోవును)

నర—అయితే అంతా సిద్ధముగా ఉందా?

H M.—అంతాసిద్ధముగా ఉందండి. అంటుకోడానికి.

నర—అదేమిటయ్యోయ్. అంటుకోవడ మేమిటి?

H M.—ఏముందండీ. మాష్టర్లంతా మలమల మాడిపోతున్నారు. చేసినదానికి జీతం పోతుందని తెగించి వెళ్ళలేరు. ఉంటే ఎన్నాళ్ళకీ ఇంతేఅని భయం. తెల్లనివూపాయి కంటబడితే కొత్తవస్తువేమో అని చోద్యంగా చూస్తారండి పాపం. ఏమిపనిచెప్పినా, మాజీతం ఇప్పించి మరీచెప్పమంటారండి. నీకుతిండికి సెక్రటరీ దొరికాడు గనుక నీకేమి తెలియడంలేదని నన్నంటారు. ఎట్లాగండి వేగడం వీళ్ళతో?

బంట్రోతు—(తిరిగివచ్చి) ఈనోటీసులో యేదోతప్పుందిటండీ దిద్దిం

చుకరమ్మన్నారు. సంతకంకూడా లేదుటండి.

నర—నోటీసువ్రాయడమే తెలియదా యేమిటయ్యా, పోనీ తెలుగునవ్రాయిండి.

H M.—తెలుగులో అసలు వెళ్ళకండి. ఇంకాఇంగ్లీషే నయము. ఎంతసేపున్నాగీతలు గియ్యడమేకాని రాయడం అలవాటు లేదండి నాకు. తప్పులేకుండా ఉంటుందాండీ. ఏడిపించాలని తిరిగి కొట్టేస్తుంటారండి. నేనందుకనే నోటితోనే చెప్పేస్తుంటాను అన్నీ.

నర—ఇప్పుడుకూడా వెళ్ళిచెప్పిరారా గంటకొట్టినాక కలుసుకోమన్నారని.

H M.—వద్దండి. నోటీసుపంపి సంతకాలు పెట్టించుకోవాలి. లేకపోతె వెళ్ళిపోయి మాకు Notice రాలేదుఅని తెగుస్తీర్లుతారు. ఉద్దేశ్యం గ్రహించి పనిచేసే మాస్టరు ఒక్కడు లేడండి. సందుదొరుకుతుందా తప్పుపట్టడానికి అనిచూస్తూఉంటారు.

నర—సంతకంకూడా లేదు టేమిటి కర్మం?

H M.—సంతకం నేనుచేస్తే technical objection రాదండీ H M. qualified కాదని. అందుచేత సంతకాలన్నీ 1st assistant చేతనే పెట్టిస్తున్నాను. ఆయన ఇవ్వాళ రాలేదు.

నర—రేపు Inspector దగ్గర సంజాయిషీ యెవరుచెప్పడం?

H M.—ఆయన మూలవిగ్రహం క్రిందకూర్చోపెట్టి గ్రంథంఅంతా నేనేజరిపిస్తానులెండి. కర్తనుకూర్చోపెట్టి మాత్రం బ్రాహ్మడే తద్దినం పెట్టినట్టు.

నర—ఒక వేళ మీరు absent అయితే acting ఎవరు?

H M.—అంతానండి. ఒకళ్ళు నా ఏమిటండి స్కూలు. నాకెవరుతో స్తే వారికిస్తూ ఉంటాను.

నర—ఒక order లేదా ఏమిటి?

H M.—order ప్రకారం మేమిస్తే work సాగదండి.

నర—సరే అయితే తప్పేమిటో దిద్ది మళ్ళీ పంపించండి. (H. M తిరిగి వ్రాసి పంపును)

మొన్న నేకామట యూ్స్ జీతాలిచ్చాను.

H M.—మొన్న నే యేమిటండి? Augustలో ఇచ్చారు. ఇది December

నర—అవును Term కాందే. Term, Termకీ ఇస్తూ ఉంటాను. నెల నెలకి ఒకసారి అయితేం. 4 నెలల కొక్కసారి అయితేం?

H M.—అవునండి నేనూ అల్లానే సర్దిచెపుతున్నాను. పోవయ్యా, చెప్పావు. అప్పుడు నాల్గునెలలకీ ఒక్కసారి ఇమ్మనో లేక 10 రూ. discount దొబ్బడానికి'' అంటారండి

నర—అయితే మనకి నెల నెలకి మాస్టర్ల జీతాలు ఇచ్చుకోవడమే కనిపిస్తుంది కాని మనకి వచ్చేదేమీ కనుపించదేమి?

H M.—ఏమివస్తుందండి?

నర—పిల్లలు జీతాలు నెల నెలకీ రావండి?

H M.—8 నెలలకేనండి వాళ్ళివ్వడం.

నర—(ఆశ్చర్యముతో) ఆఁ. తక్కిన నాల్గు నెలలూ ఊరికేనా చెప్పడం?

H M,—రెండు నెలలు సెలవు లేకాదండి.

నర—మరి సెలవులలో మనము ఇచ్చుకోవడం లేదు?

H M.—అదిమీరు తప్పించుకొన్నారుగా మొన్న.

నర—మిగిలిన రెండు నెలలదీకూడా తగ్గించుకుంటే నేగాని కార్యం లేదు. మాకు రాకపోతే మీకెట్లా ఇస్తామయ్యా మేము. ఇంకో రాబడి యేమీ లేదూ మనకి? బోలెడు గాజుసామాను తెప్పిస్తూ ఉంటారు. సరిగా బేరంచేసి పుచ్చుకుంటున్నారా మా చేత దండుగ పెట్టిస్తున్నారా? అంతమొత్తంమీద వాళ్ళు మనకి ఇనాం యేమీ ఇవ్వరూ?

M.—ఏదో కొంచెం ఇస్తున్నారుగానండి. అది ఇదివరదాకా మాస్టర్లే పంచేసికొంటున్నారండి.

నర—అదేమిటయ్యో! ఓరియ్. మీ యిల్లు నేలకట్ట! ఇదేను న్యాయం. వీలయితే ప్రతివాడూ స్కూలుడబ్బే దోచ్చేసేలాగున్నాడు.

M.—ఇదివరకు జరిగినదానికి నేనుపూచీకాదండి. ఇకముందు జాగ్రత్తగా ఉండమంటే ఉంటాము.

నర—ఏమిటో నాకొకదానికొకటి ఏమీ తోచడం లేదు. తక్షణం long bell కొట్టించేసి వాళ్ళనిట్లా పిలవండి.

(గంటకొట్టబడును. క్రమముగా టీచర్లందరువచ్చి చాపలపై కూర్చుందురు)

నర—ఏమండీ ఇప్పుడు మిమ్ములను పిలిపించుట ఒక urgent వ్యవహారం నిమిత్తం. మీరందరూ మా Institution మీద మాతృభావముంచి దానిడబ్బు హరించుటకు వీల్లు వెతకకూడదు.

T i.— రామ. రామ. (Headmaster తో) నీవుచెప్పినావుట మ్యా మేమిట్లా చేస్తున్నామని?

నర—వినవయ్యా కొసాకూను. మాయొక్క ప్రతిదమ్మిడీకూడా

మీకు విషయంతో సమానము. Institution యొక్క అభి
వృద్ధి మీరు సదా జ్ఞప్తియందుంచుకొనవలయును.

T i—నన్నొక్కమాట చెప్పమని సెలవా?

నర—No.

T i—నేను చెప్పకమానను.

నర—అయితే 2 minutes

T i—మాకువచ్చే government Teaching grant అంతా మీరు యెందుకు దోబ్బుతున్నారు?

నర—Impertinent question. అదిమేము answer చెయ్యం.

T.—You must answer.

నర—అయితే వినండి. మాకుమేము Special teaching grant కలుపుకునే జీతాలు నిర్ణయించేసాము. కనుక మీరు wrong notionsలో ఉండవద్దు. అదిమాకు రావగ్గదే. ఇప్పుడు ఆ topic కట్టిపెట్టి ప్రస్తుతంలోకి దిగుదాం.

T ii—(మెల్లగా) గంగలోకి

నర—No side talks please. గంగలోకేమిటయ్యా. చేదా యేమిటి? పెందరాడే నాలుగు మెతుకులు తినివచ్చి క్లాసులో కూర్చోలేవు?

T ii—వానకురిసినప్పుడు classలోకి గంగవస్తుందిలెండి.

నర—అదిమీలోపమే. నేయించేటప్పుడు పెంకు లెగిరిపోకుండా గట్టిగా ఉండేటట్టు నేయించవద్దూ. సరేలెండి దానికేం. ఈమాటు జాగ్రత్తగా చూచుకుంటారు.
(Headmaster తో) ఏమండోయ్ వీళ్ళ temper చూస్తే rebellious గాతోస్తుంది. కాస్త ఈనాలుగు రోజులూ సవ్యముగా నడిపిస్తాను వ్యవహారం.

H M.—చిత్తం లేకపోతే చాలాచిక్కులు వస్తాయండి.

నర—సోదరులారా! ముఖ్యముగా మిమ్మలనందర్నీ ఇక్కడికి కెందుకు రమ్మన్నానంటే రేపు Inspection వస్తాయున్నది. వెనకటి Inspectorకి చేసినట్టే ఈయనకుకూడా బస అనుకూలముగా ఏర్పరచి Supplyలు బాగాచేయించి మన గ్రామ ధర్మం నిలబెట్టుకోవలసియున్నది. ఈసారిమాకు మాస్టర్లకి జీతాలివ్వడానికే చాలాచిక్కుగా ఉన్నది. పాపం మీరంతా పిల్లాజెల్లాతో యీకరువుకాలంలో యేలాగు ఇబ్బంది పడుతున్నారో! ఈనెలలో grant వస్తుంది. ఇంకొక్క 15 రోజులలో మీసొమ్ముఅంతా up-to-dateగా ముట్టచెప్తాను.

T iii—మాకేం నమ్మకంలేదండి ఈకబుర్లతో.

నర—మీకెట్లానమ్మకముంటుందండి?

T iii—మాసొమ్ము మాకు నెలఅవడంతోనే పారేస్తే ఉంటుంది.

నర—Headmaster గారూ, ఆయనపేరు Note చేసుకోండి. ఆయన జీతం ఆయనికి పారేసేద్దాం. పాపం చాలా యిబ్బందిలో నున్నట్టున్నాడు.

T iii—అందరికోసం చెప్పినానండి. నాకోసమే చెప్పలేదు. (మిగిలిన మాస్టర్లతో) ఏమండీ ఎవరూ మాట్లాడరు సమయానికి.

కొందరు—ఇస్తారులెండి పాపం ముందూ వెనుకా అవుతుంది.

T iii—మిమ్మల్ని నమ్ముకుంటే గంగలోకే దిగడం. అందుకే ఇక్కడ ఇన్నిఆటలు సాగుతున్నాయి. మీయిష్టంవచ్చినప్పుడివ్వండి సెక్రిటరుగారూ నాకేమి యిబ్బందిలేదు.

నర—అయ్యా, ఎవరికైనా కావలిస్తే నన్నడుగుతూ ఉండండి. చిల్లర రూపాయి, అర్ధా ఇస్తూఉంటాను. మొగమాటంపడి

మానకండి. ఆ ఉసురు నాకుతగులుతుంది. ఇప్పుడింతకీ చెప్పదలచిన దేమిటంటే రేపుగాక మరునాడు D. E. O. వస్తున్నాడు. పెనకాల deputyలు, సిబ్బందికూడా ఉంటారు. వీళ్ళకి supply లకుగాను నూరురూపాయిలు కావలసి ఉన్నది. ఆసొమ్ము ఇప్పుడెక్కడనుంచి రాబట్టుకోవలసినదని question. అది నేనిట్లా solve చేస్తాను.

T.—మేముంతా ఇచ్చుకోనేటట్టు. అదేనా చెప్పండి.

నర—ఉండవయ్యా. చంపేస్తున్నావేమిటి నువ్వు ఇందాకటినుంచి మాటతోణకనియ్యవు. మీరిచ్చుకోకపోతే ఊళ్లోవాళ్లిచ్చుకుంటారయ్యా, రేపు పొద్దున్న వాడు prejudice అయి ఇక్కడమాస్టర్లు teachingకి useless అనివ్రాస్తే నీకా, మాకా? నిజం చెప్పండి బాగాఆలోచించుకుని.

T 4—నాలుగునెలల జీతాలూ discount తీసికోకుండ ఒక్కమాటు ఇచ్చేస్తే 100 రూ. మా అందరిమీద తగ్గించుకోండి. మాఅభ్యంతరం లేదు.

నర—ఏమి? ఇది అందరికీ ఇష్టమేనా?

అందరు—సరే. మరితప్పుతుందా.

నర—రెండో item. తెల్లటి ఇస్త్రీమడతలు కట్టుకుగావాలిమీరు. చాకలివాడు రాకపోతే ఎరువైనా తెచ్చి కట్టుకోండి. దరిద్రుల్లాగ రావద్దు. ఏమండీ శాస్త్రులుగారూ. మీరుశాలువా కప్పుకురావాలి.

శాస్త్రి—నాకు లేదండి మహాప్రభో.

నర—శాలువాలేకుండా శాస్త్రివి మెట్లాగయినావయ్యా. నాదితీసుకోండి. ఈరోజుమట్టుకే.

శాస్త్రి—చిత్తం.

T 3.—మాకెవరూ బట్టలెరువియ్యరండి.

నర—ఇయ్యకపోతే ఈరోజు ఉడకబెట్టి రేపుఇస్త్రీ చేసుకోండి.

T 3—ఇక్కడ నాలుగు నెలలు మాస్టరీచేస్తే Jack of all trades కావచ్చును.

నర—అవాలయ్యా, అప్పుడేకాని మనిషి perfect man కాడు. సరే మూడోసంగతి. గడ్డాలు గీసుకు నుఱీరండేం. గరుకు గరుకుగా తెలుపు నలుపు రంగులతో విచిత్రంగా కాక.

శాస్త్రి—ఓయి బాబో. కొంపతీసేసారు. రేపూమెల్లుండి కూడా మంగలివాణ్ణి ముట్టుకోకూడదు.

నర—మా యింటికిరావయ్యా నేను క్షవరంచేస్తాను.

శాస్త్రి—ఎంతమాట! తమరులాంటినుండి క్షవరం చేయిస్తూఉండాలి కాని ముట్టుకోవడమే. అయినా మాగడ్డాలు ఆచిన్నివాడే కాను చూడడం, అట్టేతగాదాఉండదు. తరువాత హాంశము సెలవియ్యండి.

నర—అంతే నేనుచెప్పేసంగతి. చూడండి acquittance Rollలో సంతకాలు పెట్టెయ్యండి. arrears కనుపించకుండాను.

అందరు.—(తెల్లబోదురు)

నర—అదేమిటండీ. అట్లా తెల్లబోతారు. సొమ్ముువారం తిరగకుండా ఇచ్చేస్తానుగా. recognition లాగేస్తాడుమరి చెయ్యకపోతే ఆమాత్రం నమ్మకం లేదుటయ్యామీాకు. HeadMaster గారూ! వేరేకాగితం ముక్కవ్రాయించి ఇవ్వండి, వీళ్ళడబ్బు తిని బాగుపడతాామనుకుంటున్నారు గాబోలు. ఏదోఎల్లకాలం వస్తుందా ఇబ్బంది.

H M.—పెడదామండీ. పాపం ఆయన అన్నివిధాల చెపుతూఉంటే

ఆమాత్రం నమ్మకముభయముతో లేకపోతే మన మొక్కనిమి
షం ఇక్కడ పనిచెయ్యగలమా. ముందో, వెనుకో, అస
లో, కొంచెము తగ్గో ఇదివరదాకా ఇస్తూనేఉన్నారు. ఈ
మాట ఇట్లావచ్చింది. చేసెయ్యండి. అనుమానించకండి.

T 3.—ఏమోనండి. మాకేమీ మనస్సొప్పడం లేదు. ఏదైనా బం
గారం మాతో నమ్మకమైనా వాడిదగ్గిర ఉంచుతేనేగాని మే
ము సంతకంపెట్టమండి.

H M.—అదె మీయిల్లు బంగారంగాను. లోకువగాఉందిటయ్యా
బంగారం.

నర—చూడండి Headmasterగారూ. ఇంక వాళ్ళతో నెగ్గలేము
మనము. ఇన్నాళ్ళలాకాదు. Next year ఎట్లాగూ
Staff ని అంతా remove చేస్తూఉన్నాముగనుక ఈనాలుగు
నెలలూ వీళ్ళతోటి పోట్లాటెందుకు? ఇప్పుడే Salary కావల
సిన వాళ్లు చేతులెత్తండి. ఎక్కడనుంచైనా అప్పుతెచ్చియినా
పారేస్తాను.

(ఎవరూ చేతులెత్తరు)

నర—ఏమి? అందరూ సంతకాలు చేస్తారా గొడవచెయ్యక!

అందరు—(ఊరకుందురు)

H M.—ఏదో నేనుచేయిస్తానులెండి.

నర—మరింక నేను చెప్పవలసినదైపోయింది. మీరేమయినాఉంటే
చెప్పండి. మరొక్క సంగతండోయ్. ఇన్స్పెక్టరున్న రెం
డురోజులూ పగలు కొంచెం భోజనం తక్కువచేయవలసినదని
నాప్రార్థన. గొంతుకదాకా మెక్కివస్తే క్లాసులో నిద్ర
వచ్చి కునికిపాట్లు పడగలరు.

శాస్త్రి—మహాప్రభో! మీకాభయమక్కరలేదు. మీస్కూల్లో అడుగు పెట్టినతరువాత కడుపునిండా ఎవడూ తినడమేలేదు. మాస్టర్లకి భగవంతుడుచేసిన యేర్పాటేఅది. మీరు Special గా ప్రార్థించక్కర్లేదు.

T 4—నిజంకూడా 10 గంటలకి తిండితిని రావడంతోటే క్లాసులో నిద్రకూడావస్తుందండి. మహారాజులాగ ప్రొద్దున్నే పెట్ట కూడదండీ బరి కొన్నిఊళ్ళలోలాగ. చాలా activeగావని చేయొచ్చును. తిండితిన్నాక హాయిగా విశ్రమించవచ్చును. ఇదెందుకు తెలియదండి వెధవలకందరికీ?

T 3—ఓరి నీతాడుతెగ ఊరుకోరా! రేపటినుంచి ప్రొద్దున్నే బరిఅంటే చస్తాం. హాయిగా జాముప్రొద్దెక్కేనదాకా పడుకోడానికి అవకాశమేదోయ్. చేశావు వెధవ Suggestion ఎల్లాగయితేం. కడుపునిండా కాఫీత్రాగడానికైనా Time ఉండదు.

H M—అయిందాండి discussion. సెక్రెటరీగారి అనుమతిపైని నేను నాలుగు మాటలే విన్నవించుకుంటున్నాను. ఆమాటలుశ్రద్ధతోవిని ఆచరణలో పెట్ట వేడుచున్నాను. నాకు రాకరాక ఈ Headmaster ఆపద తటస్థించినది. నేనీపోస్టుకు ఎంతమాత్రం qualified కానప్పటికీనీ, సెక్రెటరీగారు కారణాంతరములచే దీనిని నాపైకి త్రోసిరి. స్కూలునకు సంవత్సరమునకంతకూ Inspection రెండురోజులే గడ్డురోజులు. ఆరెండురోజులూ కళ్ళుమూసుకుంటే ఏడాదీ సుఖపడవచ్చు. కొన్నిస్కూళ్ళలో ఇదిమొదట రెండుమాసములలోనే అయిపోతుంది. అక్కడ మాస్టర్ల సౌఖ్యమే సౌఖ్యము. పిల్లల composition పుస్తకాల్లో నెలరోజులకోసారి correct చేసి

రోజుచేసినట్టు నంతకాలెట్టి Impression మాకు కలేస్తూ ఉం డవచ్చు Notes of Lessons పుస్తకాలు coffee hotel వాళ్ళకి పడవేయవచ్చును. ఇటువంటి సదుపాయములన్నీ మనకి unfortunate గా లేవు. అయినప్పటికీ ఇక్కడమీరు కూడా work అంతా arrearsలో ఉంచారు. అదిమీ బద్ధకంచేతనేగాని వేరొకటికాదని నాకు తెలుసును. దయచేసి ఈరెండురాత్రిళ్ళు టీతాగి నా మేల్కొని పుస్తకాలన్నిటిలోనూ ఎర్రసిరా గీతలు thickగా గీసేసి Notes యావత్తు portions cover అయ్యేలాగు outline మాత్రం బడికి వెయ్యండి. Inspectorతో అవసరవశ వాగ్వాదముపెంచుకొనక మెలగవలెను నాలోయేమైనా తప్పుంటే వెనుకటి Headmaster పైనతోసివేస్తాను. మీకుకూడా అట్లనమయున్నాదిగా మాటాడుచూ వాణ్ణి capture చేయడానికి ప్రయత్నించవలెను.

T iii—అయితే శ్రీనివాసరావు గారి work మాటేమిటండి.

నర—శ్రీనివాసరావు work యేమిటండీ?

H M.—ఆయన రెండురోజులనుంచీ కనుపించడం లేదండి.

నర—అరి వెధవా! పారిపోయినాడా యేమిటండీ వంటపూటి ముండని తీసికొని. రెండురోజులనుంచి ఆముండా కనిపించడంలేదు. పోనివ్వండి నాలుగు నెలలజీతం కలిసివచ్చింది మనకి.

H M.—సరే. అకథ అట్లాఉంచండి. ఇప్పుడు ఆయన work మనము arrange చేయవలసిఉన్నది. Lower formsలో History చెప్పే ఆయన యెవరు?

T 5—నేనేనండి.

H M.—మీరు శ్రీనివాసరావుగారి work ఈరెండురోజులది కను

కోవాని prepare చేయవలసిఉంటుంది.

T 9—అబ్బో. ఇప్పుడు Impossible అది. నేను ఆ Subject touch లో లేను.

H M.—ఆరోజు పాఠం కనుకోవాని పావుగంటపాఠానికి prepare చేసుకురావయ్యా. మీరే High school forms handle చేస్తుకం అని D. E. O. తో చెప్పి assistant examiner గా వేయిస్తాను. ఏటా 300 ఏసుకోవచ్చు. చేదామేయిటి?

T 5—చిత్తం. మరి నేనిస్కూలు ఫయినల్ failed, higher grade trained పనికివస్తానాండీ?

H M.—చాలా experienced గనుక Try చేస్తున్నామని exemption తీసుకుంటాను. నీకెందుకు ఆతంబాలన్నీన్నీ Management గొడవ. తక్కువక్లాసులు చెప్పేవాడికి యెక్కువ క్లాసులు చెప్పాలని, చిన్న subjects వాడికి పెద్ద subjects లో వేలెడదామనీ యేడిపిస్తూ ఉంటుంది. నీకా ambition లేదేం?

T 5—లేకేమండి? అందుకనే కాదూ 8 ఏళ్ళనుంచి private గా School final కట్టుతున్నాను. Thanks మీయొక్క help కి.

H M.—ఇంక మరోసంగతి. మరునాడు చామాలమ్మ సంబరం. బడికి పిల్లకాయలెవరూ రాకపోవచ్చు.

అందరు—వహావ్వా! వహావ్వా! మూడుమరీనయం.

H M.—అదికాదు. పిల్లలు లేకపోతే black mark వస్తుంది. మీరందుకని 9 గంటలకే భోజనాలు చేసివచ్చి చామాలమ్మ గుడిదగ్గర ఉండండి. అక్కడ చేరిన పిల్లకాయల నందరినీ ఇక్కడకు ఈడ్చుకువస్తూ ఉండాలి, కాని వెధవ యెవడయి

నా ఉంటే సెక్రెటరీగారి పుట్టినరోజు చేస్తున్నారు. Sweets పెడుతున్నారని చెప్పండి

వర—రేపే మీరు announce చెయ్యండి. Sweets పెడతారని

H M.—చిత్తం.

వర—మధ్యాహ్నం Half holiday ఇద్దాం. Office Inspection చేసుకుపోతాను.

శాస్త్రి—పొద్దున్న Sweets పెట్టకపోతే మధ్యాహ్నం Half holiday అదే అవుతుంది. మనం ఇయ్యక్కర్లేదు.

అందరు—(నవ్వుదురు).

H M—ఇంకేమేను చెప్పవలసినదేదీ లేదు. మీకెవరికైనా సందేహాలుంటే అడగవచ్చును.

T 3.—Inspector గారితో మా సంగతేమైనా చెప్పుకోవచ్చునాండీ?

వర—స్కూలుసంగతు లేమీ చెప్పడానికి వీలులేదు.

T 3—స్కూలుసంగతులు కాక మా Private సంగతేమైనావుంటాయేమో అని ఆయనతో చెప్పుకోడానికి, పైఅధికారికనుక grievances ఏవైనాఉంటే చెప్పుకోవచ్చునా అని అడిగినాను

వర—grievances అంటే?

T 3—అంటే కష్టాలండి.

వర—కష్టాలు మేమే తీరుస్తాం. డబ్బుకష్టంకన్న మీకు వేరేకష్టమేముంది. అదిమేము ఈవాళో రేపో మీకెనుగాన్ని పారవేస్తూనే ఉన్నాం. Institution నాదీ అనుకుని మీరందరూ పనిచెయ్యాలండి. Headmaster గార్ని చూడండి. ఆయన రాత్రి పగలు Clerk లాగ ఎట్లాపనిచేస్తాడో ఇక్కడే ఉండి.

T 3—బాగుందండోయ్. ఆయనదారి వేరు. మేము అట్లావెట్లా ఉండగలమండీ?

నర—అందరూ అట్లావుండనక్కర లేదు. ఇది Voluntary. మన మింక Part అవుతే మంచిది. మరునాడు కలుసుకుందాం. Inspection నేను లేనిదే తగలడుతుంది.



# పల్లెటూరి పాఠశాల.



## తొమ్మిదవ రంగము.

[ ప్రదేశం స్కూలు ముందర చెట్టుక్రింద. ]

( ప్రవేశం నల్గురు విద్యార్థులు. )

boy 1—ఒరేయ్ మనమిప్పుడు classes లో Strike organise చెయ్యాలి. ఏమంటారు మీరు?

boy 2—Insult చేసిన teacher నే Strike చేయకూడదాఅని. ఒంటరిగా వెళ్ళేటప్పుడు ఓత డాఖాతీస్తే.

boy 3—అబ్బే అది Non-voilence కాదోయ్. అటువంటి teacher ఉంటే school కి bad name గనుక దానికే బుద్ధిచెప్పాలి మనము.

boy 4—నాకేమో భయము వేస్తోంది బాబు. నాకు scholarship కూడా ఇస్తున్నారు.

boy 1—నీకు మేమంతా చందా వేసుకిస్తాము కాని అడ్డురాకురా. రేపు గుమ్మముదగ్గ నిలబడి ఒక్కొక్కళ్లే మెడపట్టుకు గెంటేస్తూ ఉండాలి.

boy 4— Ring leader కే వస్తుంది ఆఖరుకి.

boy 1—రానివ్వరా. ఇవ్వి Students రోజులుకాని మాస్టర్లవి కావోయ్. Mass movements ఎప్పటికీ fail కావు. మనకేమైనావస్తే ఏంజేస్తానో తెలుసునా. All-India-Student federation ఒకటి లేవదీసి అలకల్లోలముచేసేసి మాస్టర్లని గగ్గోలు పెట్టేస్తాను. Students మజానీకు తెలియకుండాఉంది.

boy 3—మనము మేస్టరికి ఎందుకురా భయపడడం. అదిముందు చెప్పనారు.

boy 4—fail చేస్తాడని. లేకపోతే పరీక్షకు పంపడని.

boy 1—అరి వెర్రిమొగమా, ఇవి base fears. మొన్న ఒకవూళ్ళో ఏమయిందో తెలుసునా, 40 మందిని detain చేసేటప్పటికి Sub-Magistrate aid కోరవలసివచ్చింది Headmaster.

boy 2—అవును. మొన్ననే paperలో చదివాము ఒక Teacher ఒకపెద్దమనిషికొడుకును కొట్టితే ఆయన ఛార్జిఇచ్చాడట.

boy 1—అవన్నీ చేతగాని పనులు. Peaceful and lawful methods try చెయ్యాలి మనము. రేపు students conferenceకిపోయి Relation between students and Teachers మీదకొన్ని Rules and regulations frame చేసి adopt చేయిద్దాము. ప్రతి districtలోనూ Students and teachers కలిసిన కోర్టు ఒకటిపెట్టి ఈతగాదాలు అక్కడ పరిష్కారం చేయిస్తూఉండాలి.

boy 4—రేపు Strike ఒకటి Successful గా చేస్తూ నీప్రజ్ఞ చూస్తాను.

boy 2—రేపు Inspection భాగవతంకూడాచూచి మెల్లిండి చేద్దాము.

boy 1—సరే అయితే మనము కట్టుకట్టి Inspector క్లాసులో మేస్టర్లు ఏది అడిగినా పెదవి మెదపవద్దు. పైగా మాకా portions కాలేదని చెప్పుదాము.

boy 2—good. good. ఇది Succeed అయితే ఇంక Strike అవసరమేలేదు. కొట్టాఅక్కరలేదు తిట్టాఅక్కరలేదు పదండి. ఇది అందరతోనూ చెప్పుదాం.

(పోవును.)

# పల్లెటూరి పాఠశాల.

పదియవ రంగము.

(ప్రదేశం teachers' private room.)

T 1—నా క్లాసులో ఏమీ response లేదండీ. రామ. రామ.

T 2—మీ క్లాసులు నయమేనయ్యా, నేనుఏది అడుగుతే ఆ దేమా కు చెప్పలేకన్నారు

T 3—నేనక్కడికి తెలిసినవాళ్ళనే అడిగినాను. అందరికి మొఖం కప్పేసింది, ఎందుచేతనో.

T 4—అయితే అన్ని క్లాసులూ అల్లాగే ఉన్నాయన్నమాట. నాదొక్కటే అనుకున్నాను. ఎంత Simple question అడిగినా చెప్పలేదేమండీ వెధవలు. నేను Answers అందిచ్చినాను కూడాను.

T 5—అందివ్వడం ఏమిటి? నేను 10 మాట్లు rehearsal చేసిన questions అడుగుతే తెల్లబోతే వెధవలు.

T 1—వెధవ సరుకురా ఇది, చదువుమీద ఎవడికీ శ్రద్ధ లేందే.

(సెక్రటరీ గుమాస్తా ప్రవేశింతురు. అందరు లేచి నిలబడుదురు)

సర—కూర్చోండి. ఏమిటి 6 నెలలనుంచీ 1 పాఠమైనా చెప్పలేదు ఒకడూకూడాను.

T 1—చెప్పకేమండీ వెధవలు చదవందే మేమేమిచెయ్యాం.

సర—ఒక్కడూ చదువడుటయ్యా.

T 2—కొంతమంది చదివి మరచిపోయారండి. నేనునిన్న వ్రాయించిన Slipలో questions అడుగుతేనే తెల్లపోయారండి

నర—ఏమో ఇంకమీా excuses ఏమీా నేను వినను. ఏమీా portions కాలేదని D. E. O. బాగా రాసేసాడు. మీారం దరు కట్టుకట్టి నుమ్మల్ని ఏడిపించాలనుకుంటే సాగుతుందా. 1000 మంది unemployedగా ఉన్నారు. మీాలాంటి వాళ్లు తోంభయిమంది వస్తారు. క్లాసులో నిద్రపోతున్నారట మీారు ఇన్నాళ్ళున్నా.

T 1—రామ రామ. లేనండీ ఇదంతా...

నర—ఇంక నేను ఏమీా వినను. writerగారూ నోటీనులు వ్రాసె య్యండి వీళ్ళందరికీ. Januaryలో reopening day క్రొత్త Staffతో ప్రారంభించుదాం.

clerk—చిత్తం.

T 1—అయితే మాజీతాలు పారెయ్యండి నుది.

నర—సిగ్గు లేదుటమీాకు, జీతం అడగడానికి. నువ్వు చెప్పిందేమిటి నేను జీతం ఇయ్యడానికి.

T 1—ఎందుకండి పంతులుగారూ మీాతోకలహం. మేముఎల్లాగు పో తూఉన్నాం మాడబ్బుమాకు పారెయ్యండి. అనవసరంగా ఖర్చులెందుకు.

నర—ఖర్చులేమిటి privy councilకి వెళ్ళినా మీారు తెప్పించు కోలేరు. మాసంతకాలు మాకువచ్చేసాయి.

(టీచర్లందరు తెల్ల తెల్లబోయి చూాచుచుండగా సెక్రటరీ చల్ల చల్లగాజారుచుండగా తెరమెల్లమెల్లగా క్రిందబడును.)





*For copies apply to:--*

The Author

*MADANAPALLE.*



